# గజల్ జ్యోత్స్న

## తెలుగు గజళ్ళు



ఎన్వీ రఘువీర్ ప్రతాప్

ధర్మకేతనం సాహిత్య కళాపీఠం

# గజల్ జ్యోత్స్న

(తెలుగు గజల్స్)

ఎన్వీ రఘువీర్ ప్రతాప్



ధర్మకేతనం సాహిత్య కళా పీఠం (రి)
హైదరాబాద్

# GHAZAL JYOTSNA

(Telugu Ghazals)

By **N.V. Raghuveer Prathap**

First Edition : **October - 2021**

Copies : 500



Cover Design : **N.V. SREEKETHAN**

Inner Images : **SURARAM SHANKAR**

Copies Available At :

N.V. Raghuveer Prathap

# 9-6-369, Flat N0. 103, Road No. 14, Maruthi Nagar

Champapet, Hyderabad -500 059.

Mobile NO: 91-9440551552 E-mail Id: nvrvp1@gmail.com

& All Leading Book Shops

Price: **Rs. 100/-**

Printed at : Sri Raghavendra Printers, Jawahar Nagar Corp.

Cell : 9440720082

E-mail : sriraghavendraprinters9@gmail.com

**DHARMAKETHANAM SAHITYA KALAPEETAM**

Regd.No. 663/2017, HYDERABAD-59





## అంకితం



**పరమపిత శివపరమాత్మకు**

**ప్రేమతో**

**ఎన్వీ రఘువీర్ ప్రతాప్**

## గజల్ జ్యోత్స్నగా రఘువీరుని కొత్త అడుగులు....

**సూరారం శంకర్**, ప్రముఖ గజల్ కవి.

గజల్ ఒక సుకుమారమైన సాహిత్య ప్రక్రియ. అరబ్బీ కసీదా నుండి ఫారసీ లోకి ఫారసీ నుండి తదితర భాషల్లోకి ప్రవేశించిన మధుర ప్రక్రియ... తెలుగులో దాశరథి గారి ద్వారా ప్రవేశించి డా॥ సినారె గారి ప్రతిభా పాటవాలతో పెరిగి పెద్దదై విశ్వవ్యాప్తమైనది...

లాలిత్యం, మృదుత్వం, సౌకుమార్యం ఈ మూడింటిని కలిపి నజాకత్ అంటారు... గజల్ సాహిత్యమంతా నజాకత్ ను అనుసరిస్తూ రాయవలసి ఉంటుంది... ఇసుమంత కాఠిన్యం తాను కూడా ఓపదు గజల్... ఈ రహస్యం ఉరుదూ గజల్ కవులకు తెలుసు... అందుకే వారి గజళ్ళలోని సౌకుమార్యం పండితుల హృదయాలను రంజింప చేస్తుంది...

తెలుగు లో సినారె గజళ్ళు సామాజిక కోణంలో ఆవిష్కరించబడిన ప్రయోగాలు.. సమాజంలోని అవ్యవస్థలపై మెత్తటి అధిక్షేపాలుగా వారి గజళ్ళు పాఠకుల హృదయాలను చురగొన్నాయి...అయితే, ఉరుదూ గజల్ సంప్రదాయాన్ని అనుసరిస్తూ ప్రముఖ కవి డా॥ పెన్నా శివరామకృష్ణ గారు తెలుగులో సల్లాపం , శిశిర వల్లకి వంటి అద్భుత పుస్తకాలను కొనితెచ్చినారు...

ప్రస్తుతము, కవి రఘువీర్ ప్రతాప్ గారు కూడా ఈ ప్రక్రియ పట్ల ఆకర్షితులై, "గజల్ జ్యోత్స్న" పేరుతో సుమారు 52 గజళ్ళతో మన ముందుకు వచ్చినారు... రఘువీర్ ప్రతాప్ గారు నాకు చాలా కాలంగా తెలుసు... వీరు చక్కని స్నేహశీలి... సౌమ్యులు.. పైగా కవి.... "ధర్మ కేతనం సాహిత్య కళా పీఠం" ద్వారా వీరు చేస్తున్న సేవలు సామాన్య మైనవి కావు... పుస్తకావిష్కరణలు, కవి సమ్మేళనాలు, పురస్కార ప్రధానాలు, సమీక్షలు వంటి అనేక కార్యక్రమాల ద్వారా తెలుగు భాషామతల్లికి వీరు చేస్తున్న సేవలు. ప్రశంసనీయమైనది...

సుమారు 2006 ప్రాంతంలో వీరు, అపురూపం, అవ్యక్త వంటి సంకలనాలు తెచ్చి అనేక కవుల కలాలకు వెలుగునిచ్చారు....





గజల్ అంటే సల్లాపం అనీ , ప్రేయసీ ప్రియుల ప్రియభాషణమనీ అర్థమున్నది... రఘువీర్ ప్రతాప్ గారి గజళ్ళన్నీ ఈ కోణంలో రాయబడినవి, కొన్ని మాత్రము ఆధ్యాత్మిక కోణంలోనూ రాయబడినవి...

"గజల్ జ్యోత్స్న" గా రఘువీరుని కొత్త గమనం....

"వన్నెలెన్నొ ఆరబోసీ నన్ను గెలుచుకుంటావు
చూపులెన్నొ వొలుకబోసీ మనసు దోచుకుంటావు" (15)

ఇదొక ప్రణయాభివ్యక్తి... ప్రేయసి పట్ల ప్రియుని ఆరోపణ కూడా... అయితే ఈ ఆరోపణ ప్రియునికి కూడా ఇష్టమైనదే కావటం ఈ మత్లా మతలబు.... ! తను వలచిన ప్రియున్ని వశపరచుకోవడంలో ప్రేయసి ఎంచుకున్న ఎత్తుగడ పట్ల ప్రియుడు కూడా అనురక్తిని ప్రదర్శించడం పరాకాష్ఠ...

నిజానికి ప్రేయసీ ప్రియుల లోకము ప్రాపంచిక దృక్కులకు అందనంత ఉన్నతమైనది... వారి ప్రపంచంలో అనంతమైన ప్రేమ, ఆనందము, త్యాగము వంటి ఉన్నతమైన ప్రమాణాలు దాగి ఉంటాయి.. రఘువీర్ గారు పై మత్లా లో కూర్చిన రహస్యం కూడా అదే....!

మచ్చుకు మరొక గజల్ మత్లా....

"నీ రూపమే నా మదిలో నిశ్చలమయి నిలిచింది
నీ ధ్యానమే నా మనసులో నిర్మలమయి తిరిగింది" (12)

ప్రియురాలి రూపము నిశ్చలమై, తన పేరు ధ్యానమై అలరారుట అన్నది స్వచ్ఛమైన ప్రేమకు ప్రతీక....!

మరో మత్లా......

"గాలి ఎన్ని గమకాల్ని నేర్పిందో నా చెలికి
హంస ఎన్ని పాఠకుల్ని కూర్చిందో నా చెలికి"

అంటూ విస్మయ ప్రకటన గావిస్తాడు ప్రియుడు... విస్మయ ప్రకటన అంటే, ప్రేయసి తాలూకు సౌందర్యాతిశయమునకు ప్రియుడు ఆశ్చర్యపోవడమే... ఆ ఆశ్చర్యము లో తనపై ప్రేమను తెలియపర్చడం కూడా ఉన్నది...

"వెన్నెలే ల ?" అనే రదీఫ్ తో కవి రఘువీర్ ప్రతాప్ గారు మరో గజల్ ను

చక్కగా కూర్చారు...

" వెల లేని చిరునవ్వు లారబోయగా, వెన్నెలే ల?
ప్రియసఖి తనమనసారబోయగా , వెన్నెలే ల?" (34)

నిజమే. ప్రకృతిని మించిన శోభ ను దర్శించినపుడు, ప్రియుడు తన అతిశయం తాలూకు ధిక్కారాన్ని తెలిపే మత్లా ఇది... నిజానికి ప్రకృతిని మించిన శోభ లేదు. కానీ ప్రేమ యొక్క సాంద్రతను తెలిపే క్రమంలో మన ఆలోచనల క్రమము ఇలాగే ఉంటుంది...

కవి, ఈ గజల్ గుచ్ఛం లో ఆధ్యాత్మిక భావనలను కూడా కవి పొందు పర్చాడని ఆదిలో చెప్పుకున్నాం... దానికి ఉదాహరణ ఈ క్రింది షేర్లు.....

" కనిపించెడి జగమంతా నిటలాక్షుడి ఆటేనట
కంటికి అగుపించనిదేదో ఉంటుందని నీవు తెలుసుకో!
ఆస్తిపాస్తులేవి రావు, ఆలుబిడ్డలెవరు రారు
కామక్రోధాలు మానుకో, రాజయోగివై నీవు సాగిపో!"

పై గజల్ షేర్లను విడమర్చి చెప్పాల్సిన పని లేదు... అందరికీ ఇవి సుబోధకరమైన వ్యక్తీకరణలే... ఈ ప్రపంచం ఒక అద్దె ఇల్లు... ఎవరైనా నూ, ఎప్పటికైనా నూ ఈ ఇల్లు ఖాళీ చేయాల్సిందే... యుగయుగాలుగా ఎవరూ ఇచట నిలిచి యుండినవారు లేరు... సమయం ఆసన్నమైందో వెంటనే తనువు చాలించాల్సిందే... ఏ ఆస్తులూ, బంధుగణం, మిత్రతతి ఏదియునూ వెంటరాదు....

ఇలాంటి ఆధ్యాత్మిక భావాలు రాయడానికి కవి, పూర్వాశ్రమంలో భక్తి తత్పరతల మార్గములో గమించినవాడై యుండవలెను... " ధర్మ కేతనం సాహిత్య కళా పీఠం" నిర్వాహణ యే దీనికి చక్కని ఉదాహరణ...!

ఇవిగాక, ఈ సంపుటిలో మూసల్ సల్ గజళ్ళకు కూడా స్థానమిచ్చినారు రఘువీర్ గారు... మూసల్ సల్ గజళ్ళు అంటే. ఏకవస్తు గజళ్ళు అని అర్థం... ఒకే వస్తువును గజల్ సాంతం కూర్చడాన్ని ఏకవస్తు గజల్ అంటారు .ఇలాంటి గజళ్ళకు రెంటాల వారి కలం పెట్టింది పేరు...





**రఘువీర్ గారు ఈ సంపుటిలో ..........**

మనసు( 8), చంద్రిక (22), అమ్మతనం (23,,) చెట్టమ్మ (27 ), ప్రేమ లేఖ(33), లాంటి గజళ్ళను ఈ కోణంలో రాసి తన గజల్ జ్యోత్స్న లో పొందుపరిచినారు.....

భావ వ్యక్తీకరణ లో విషయప్రాధాన్యత ఒక్కటే ఉంటే సరిపోదు... అందమైన పదసంపద, అలంకారయుతమైనభావ ప్రకటనల కూర్పు కూడా అనివార్యము.....

.. అలాంటి చక్కని గజలే ఇది -

" కోరిక తీరిందా, కొత్తది పుదుతుంది!
తీరిక దొరికిందా,పాతది తోడౌతుంది!
చపలత్వమే మనసు తత్వమైతే
వశము తప్పిందా, చిత్తము చెడుతుంది!
తప్పులు చేసేందుకు, అలవాటు పడితే
చేసెడి చర్యంతా సత్యమైంది అనిపిస్తుంది!

ఈ గజల్ సాంతం సూక్తుల మయంగా ఉన్ననూ చమత్కార రంజితమై అలరారటం పఠితలు గమనించగలరు...

ఇలా సుదీర్ఘ వత్సరాల సాహిత్య మథనం అనంతరం... నేడు గజల్ కవిగా, "గజల్ జ్యోత్స్న" పేరిట మన ముందుకు వచ్చిన సీనియర్ కవి రఘువీర్ ప్రతాప్ గారి కృషిని అభినందిస్తూ గజల్ సాహిత్య వనంలోకి సాదరంగా ఆహ్వానిస్తూ.. వీరి కలం నుండి మరిన్ని మంచి గజళ్ళు రావాలని ఆశిస్తున్నాను... శుభం భవతు...!!

**సూరారం శంకర్, ప్రముఖ గజల్ కవి.**
పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం హైదరాబాదు వారిచే
"కీర్తి పురస్కార " గ్రహీత.. అధ్యక్షులు, సాహిత్య తరంగిణి
రచయితల సంఘం కామారెడ్డి జిల్లా శాఖ,
కామారెడ్డి పట్టణం-503111.తెలంగాణ రాష్ట్రం.
మొబైల్ నెంబర్... 9948963141.

## "గజల్ జ్యోత్స్న" కావ్యంతో కాసేపు

– అచార్య ముకుంద సుబ్రహ్మణ్య శర్మ

శ్రీ రఘువీర్ ప్రతాప్ గారి 'గజల్ జ్యోత్స్న' పుస్తకాన్ని చదివే అవకాశం నాకు రావడం చాల సంతోషాన్ని కలిగించింది. ఈపుస్తకంలో ఏభై చక్కటి గజళ్ళు ఉన్నాయి. పారసీక ఉర్దూ గేయ వాఙ్మయము నుండి తెలుగు లోకి వచ్చి అతికొద్ది రోజులలోనే ఎంతోమంది తెలుగు భాషాభిమానులని తన వైపుకి తిప్పు కుంది గజల్ ప్రక్రియ. గజల్ కి ప్రత్యేకమైన నియమాలు ఉన్నాయి. మత్లా, మక్తా, కాఫియా, రదీఫ్, ఛందస్సు, చమత్కారం లను అనుసరిస్తూ ద్విపద రూపంలో ఉండే ఈసాహితీ ప్రక్రియ ప్రేమ, విరహంతో పాటు ఇతర సామాజిక అంశాలని కూడా తనలో ఇముడ్చుకుంది.

ఎన్నో సాహితీ ప్రక్రియలలో విశేష అనుభవం కలిగిన శ్రీ రఘువీర్ ప్రతాప్ గారు ఈ గజల్ జ్యోత్స్న కావ్యంలో ఆణి ముత్యాల్లాంటి అద్భుతమైన గజళ్ళని మన కందించారు ప్రతాప్ గారు. అన్నీ గాన యోగ్యమైనవే పాఠకులని రంజింపజేసేవే అనడంలో సందేహం లేదు.

ముందుగా గజల్ నిర్మాణంలో ప్రతాప్ గారు కనబరిచిన ప్రతిభని ప్రత్యేకంగా చెప్పుకోవాలి. నడకలో గానీ ఛందస్సులో గానీ తడబాటు లేకుండా ఉండటం ఎంతైనా ప్రశంశ నియము. ప్రతి గజల్ లో రదీఫ్ లని అందంగా వాడటం మనం గమనించచ్చు. అలాంటప్పుడే చమత్కారం పండి గజల్ లయ బద్ధంగా సాగుతుంది. మచ్చుకి ఈమత్లాలని చూడండి

పదేపదే నాకనులకు కవ్వింతవి నువ్వే..
పెదాలపై జనియించే పదకవితవి నువ్వే...!
అలాగే మరో గజల్ లో...,
వికసించే పూవులలో చల్లనినీ నవ్వుంది
వినిపించే సవ్వడిలో తీయనినీ పిలుపుంది!
మరో చోట

కరిగే కాలాన్ని ఇపుడు కొలుస్తున్నది మనస్సు
నీసన్నిది నాపెన్నిది తపిస్తున్నది నామనస్సు..!





చక్కని భావసౌందర్యానికి ఇంతకన్న ఏం కావాలి?

అలాగే చమత్కారం పండిన షేర్లు సైతం చాలానే ఉన్నాయి. అలాంటి అందమైన షేర్లనుంచి మనల్నిపదే పదే వెంటాడే వాటిల్లో ఒకటి రెండు మీముందు ఉంచుతున్నా.

అధరానికి తొందరేల దరహాసం కావాలని
హృదయానికి తొందరేల మధుమాసం కావాలని..!

ఇక్కడ భావంలో కావాలని రదీఫ్ ఎంత అందంగా అమరిందో అంతే సున్నితమైన చమత్కారం మెరిసింది.

రేపన్నది లేని రోజు వస్తుందని ఎరిగినా
ఆశతోనే బ్రతుకంతా సాగుతూనే ఉన్నది!

తాత్వికత కి అద్దంపట్టే ఈషేర్ అందరికీ గుర్తుండి పోతుంది. జీవిత సత్యానికి అక్షర రూపం అంటే ఇదే !

గాఢతని ప్రతిబింబించే గజళ్ళు ఎన్నో ఉన్నాయి అవి పాఠకులని మళ్ళీ మళ్ళీ చదివిస్తాయి. ఆ కోవలోకి వచ్చే ఈ మత్లా ఒకసారి చూడండి.

గమ్య మెరుగని దారిలోన సాగి పోవుట దేనికి?
మనసునిండుగ నవ్వలేక బ్రతుకుట దేనికి?

ఓడిపోయిన వాడికి గమ్యం కనరాదు .ఆబాధలో తన చుట్టూ ఉన్న సంతోషాలని గమనించ లేక నవ్వటం మర్చి పోతాడు. అందుకే ప్రతాప్ గారు మరో గజల్ లో

సుడిగాలి చుట్టు ముట్టిందని ధైర్యాన్ని కోల్పోకు!
అపజయాలే విజయాలకి నాంది అని
మరువబోకు..అంటారు..

ఇలా చెప్పు కుంటూపోతే నావ్యాసం పరిధి దాటే ప్రమాదం ఉంది. మొత్తానికి గజల్ వాఙ్మయములో మరో మంచి గ్రంధాన్ని చదివిన అనుభూతి ఇచ్చింది 'గజల్ జ్యోత్స్న' కావ్యం! రానున్నరోజుల్లో మరిన్ని అద్భుతమైన గజళ్ళని ఆశిస్తూ శుభాభినందనలతో...!

– అచార్య ముకుంద సుబ్రహ్మణ్య శర్మ
విశ్రాంతాచార్యులు కాకతీయా విశ్వ విద్యాలయం, వరంగల్లు
సెల్ నెం : 9849257174

## తెలుగు గజల్స్ లో కొత్త కోణాలు ఆవిష్కరిస్తూ గజల్ చాందినీ వెలిగించిన 'రఘువీరుడు'

– కళారత్న బిక్కి క్రిష్ణ

"Modern ghazal, which is traditional in form persianised in language, and delicately modern in feeliings".

- Faiz ahmad faiz

ఆధునికమైన గజల్ రూపంలో భావనల్లో ఎలా ఉండాలో ప్రఖ్యాత గజల్ కవి ఫైజ్ అహమ్మద్ ఫైజ్ చక్కగా వక్కాణించారు. ఇవాళ చాలా మంది కొత్త రచయితలు చక్కని గజల్స్ రాస్తున్నారు. రూపంలో కొత్తదనం, అభివ్యక్తిలో నవ్యత, భావనల్లో స్పష్టత, తమదైన భావుకతతో గజల్స్ ను జిగేల్ మనిపిస్తున్నారు. అందుకు మనం గర్వపడాలి. తెలుగు గజల్ కేదారంలోకి కొత్తనీరు ప్రవహిస్తోంది. తెలుగు గజళ్లు వేయి పూలుగా వికశిస్తున్నాయి. సరికొత్త భావ పరమళాలు వెదజల్లుతున్నాయి. అందుకు సీనియర్ గజల్ కవులంతా ఎగిరి గంతులేయాలి. కొత్త గజల్ కవులను ఆహ్వానించాలి, అభినందించాలి, ఆశీర్వదించాలి. అదే గొప్ప సాహితీ సంస్కారం. ఇప్పుడు రఘువీర్ ప్రతాప్ గజల్ కవిగా.. హుందాగా రంగప్రవేశం చేస్తున్నాడు. అద్భుతమైన గజల్ పుష్పాలతో... తెలుగు గజల్ సరస్వతిని అర్చిస్తున్నాడు. అరుదైన రూపనిర్మాణంతో, కవిత్వపు పరీమళాలతో అద్భుతమైన అభివ్యక్తుల చమక్కులతో.. గజల్స్ రాసి.. అందరినీ అబ్బుర పరుస్తున్నాడు. అది చూసిన మనమంతా ఆనందించాలి.. అభినందించాలి.

వాస్తవానికి గజల్ ఇలాగే రాయాలని.. ఇలాగే ఉండాలని.. అందరూ గజల్స్ రాయలేరని.. కొందరే రాస్తారని.. తెలుగులో గజల్స్ లేవని.. రావని.. రాయలేరని.. గజలియెత్ లు, దవా దళార్ పద్దతులు.. సాధించడం అసాధ్యమని.. గుంటూరు శేషేంద్రశర్మ మొదలు ఎస్ సదాశివ వరకు అందరూ కొత్త కవులను భయపెట్టినవారే! అయినా కురిసిన వర్షం, వాగై, వంకై, ఏరై, సెలయేరై, నదిగామారి, సాగరంలో కలవక తప్పదు అలాగే అరేబియాలో ఏడో శతాబ్దిలో కురిసిన గజల్ వర్షం, 9 వ శతాబ్దంలో





పర్షియావో (అబ్దుల్ జఫర్ రూక్మితో) వాగై, 12 వ శతాబ్దంలో (సనవిక గజ్ నవితో) వంకై, 13 వ శతాబ్దంలో (సాదిసిరాజి, జలాలుద్దీన్ రూమితో) ఏరై, 14 వ శతాబ్దంలో (హఫీజ్ సిరాజితో) సెలయేరై నదిలా ప్రవహించింది. 1721 నాటికి (తబ్రిజ్ ఆబెదిల్) తో పాట్నా వరకు అలలెత్తింది. 17 శతాబ్దంలో డెక్కన్ లో ఉర్దూ గజల్.. వేయిపూలు గా వికసించింది. 18వ శతాబ్దంలో ఢిల్లీ లక్నోల్లో.. గజల్ జెండా ఎగిరింది. 1810 లో (మీర్ తఖీమీర్) 1869 (గాలిబ్) లలో గజల్ సుందరి అనేకరకాల హొయలు పోయింది. 19 వ శతాబ్దంలో నవాబుల కౌగిళ్ళనుండి మధ్య తరగతి కవుల కలల్లోకి.. గజల్ సుందరి ప్రవేశించింది. ఉర్దూ కవి హాలు (1914) ఇక్బాల్ (1938) పాకిస్తాన్ లో ఫైజ్ అహ్మద్ ఫైజ్ (1984) గజల్ రూపు రేఖా విలాసాలనే మార్చేశారు. ఇప్పుడు గజల్ సుందరి అందాలను ప్రపంచ దేశాలన్నిటా.. ముఖ్యంగా దక్షిణ భారతంలోని తెలుగు, తమిళ, కన్నడ, మళయాలీ కవులు ఆస్వాదిస్తున్నారు. అద్భుతమైన గజల్స్ ను ఆవిష్కరిస్తున్నారు.

తెలుగులో దాశరథి, సి.నా.రే లు తెలుగు గజల్స్ కు ఒక రూపును, ఊపును ఇచ్చారు. వారు సినిమా కవులు గనుక గజల్స్ కు మంచి ప్రచారం కల్పించారు. ఎవ్విధి రాసిన సమకాలికులు (అసూయతో) మెచ్చరు కాబట్టి గిట్టని పెద్ద మనుషులు తెలుగులో గజల్స్ రాయడం అసాధ్యమని తృప్తి పడ్డారు కాని.. ఇవాళ దాశరథి, సి.నా.రేల పుణ్యమా అని వందలాది గజల్ కవులు.. అద్భుతమైన గజల్స్ రాస్తున్నారు. నిజం చెబితే నమ్మరుగాని.. ఏ భాషా గజల్ కవులకు తీసిపోని విధంగా.. తెలుగులో పాతకొత్త మేలు కలయికగా.. గజల్ కవులు అద్భుతమైన గజల్స్ రాస్తున్నారు. అన్నీ మాకే తెలుసని విర్రవీగే అర్భకులను, అసూయాపరులను ఇగ్నోర్ చేద్దాం! ఎన్వీ రఘువీర్ ప్రతాప్ లాంటి అద్భుత గజల్స్ రాస్తున్న ఉత్సాహవంతులైన వర్ధమాన కవులకు ఆహ్వానం పలుకుదాం!

7 వ శతాబ్దిలో అరబ్బీలో కసీదా సాహితీ ప్రక్రియ.. తదనంతర కాలంలో పార్శీలో గజల్గా పరిపూర్ణ రూపురేఖలతో 13 వ శతాబ్దంలో నిగనిగలాడింది. సాగిసి రాజి, జలాలుద్దీన్, అమీర్ ఖుస్రూ కాలంనాటికి మీటర్స్, సంప్రదాయ మోడల్స్ (మత్లా, షేర్లు, మక్తా, కాఫియా, రదీఫ్

లాంటి లక్షణాలు) పుట్టుకొచ్చాయి. పర్షియన్ గజల్ లో మత్లా రధీఫ్ లు 8 వ శతాబ్దంలోనే పొడసూపాయని పరిశోధకులంటారు. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే గజల్ ఒక భాష నుండి మరో భాషకు పరకాయ ప్రవేశం చేసినపుడు దాని రూపం, భాషం, భావనలు, ప్రతీకలు, ధ్వనులు, రసాంకారాది నిర్మాణ సామాగ్రి మారిపోతుందని చెప్పడానికే. అందుకే ఒక భాషలోని గజల్ మరో భాషలోని గజల్ లాగ ఉండదు. ఉండాలనుకోవడం మూర్ఖత్వం. నీకు ఉర్దూ గజల్ నచ్చితే, నాకు తెలుగు గజల్ నచ్చవచ్చు.. మరొకరికి కన్నడ గజల్ నచ్చవచ్చు. నచ్చడమన్నది ఒకే అంశంపై అందంపై ఆధారపడి ఉండదు. పర్షియన్ గజల్ సంప్రదాయ రూపంలో, ఉర్దూ గజల్ అభివ్యక్తి మెరుపులలో, హిందీ గజల్ గానమాధుర్యంలో.. దక్షిణాది భాషల గజల్స్ వస్తు వైవిధ్యంలో అలరించి.. పాఠకులను శ్రోతలను అలరిస్తున్నాయి.

తెలుగులో గజల్ గానం, గాయకులు, హిందూస్తాని సంగీతం పోకడలు.. గజల్ నిర్మాణ పద్ధతులు.. ఇంకా బాగా.. స్థిర పడకపోవడం వల్ల కొందరి గజల్స్ ఊహించిన స్థాయిలో ఉండకపోవచ్చు కాని చాలామంది మంచి గజల్స్ రాస్తున్నారు అలాంటి వారిలో ఎస్వీ రఘువీర్ ప్రతాప్ ఒకరు.

ఇక రఘువీర్ ప్రతాప్ గజల్స్ సౌందర్యాన్ని వీక్షించడానికి.. హృదయ చక్షువులు ( కన్నులు ) అవసరమేమో అనిపిస్తుంది. ఎందుకంటే.. సహజంగా మంచి భావుకుడైన రఘువీర్ ప్రతాప్ కవిత్వాన్ని.. వ్యక్తిత్వాన్ని.. స్వీయానుభూతిని.. భావుకతను.. జీవన తాత్వికతను.. కలబోసి.. ప్రతి గజల్ ను సర్వాంగ సుందరంగా, భావ బంధురంగా.. రసధ్వని చమత్కార శోభితంగా శిల్పీకరించాడు. తాను తన్మయం చెందుతూ.. ప్రతి ఊహను వ్యూహాత్మకంగా.. ద్రుశ్యరూపం చేసి గజల్ అషార్ ( షేర్స్ ) లను నిర్మించాడు. ఒక్కోసారి రసోన్మాదిగా మారిపోతూ.. అద్భుత భావనా లోకంలో విహరించాడు. అసాధారణ ప్రతీకలతో.. అనుభూతి రమ్యతతో.. అసమాన ప్రతిభా సామర్థ్యంతో.. అరుదైన గజల్స్ ను అక్షరీకరించాడు. అతని గజల్ సౌందర్యాన్ని వీక్షిస్తే.. అరుదైన అభివ్యక్తి కనిపిస్తుంది.

చీకచి చీల్చేటి వెలగే వసంతం





పెదవిన పూసేటి నీ నవ్వే వసంతం!

అంటాడు. నవ్వును వసంతంగా భావించిన ఈ కవి సామాన్య దార్శనికుడు కాదు అందునా.. చీకటిని చీల్చేటి వెలుగు.. వసంతమైతే.. నీ నవ్వు కూడా అలాంటిదే.. నా జీవితపు చీకటిని చీలుస్తుందని ధ్వని పూర్వకంగా చెప్పిన ఈ కవి ప్రతిభను అభినందించకుండా ఉండలేం కదా! గాలిబ్ 'నాజుకి ఉస్కేలబ్కి క్యాకహెనా.. పంఖ్డీ ఏక్ గులాబ్ కీ సిహై' ( ఏమి కోమల మామె పెదవులు పోలినవి చూడు గులాబిరేకులు ) అంటే మనం ఆశ్చర్యపోయాం.. పెదవులను గులాభి రేకులతో పోల్చితేనే.. ఆశ్చర్య పడ్డాం. మరి ఈ కవి.. అదే పెదవులపై విరిసిన నవ్వులు.. వసంతమని.. అందునా చీకటిని చీల్చే వసంతమంటే.. ఎందుకు ఆశ్చర్య పడకూడదు.. మరో గజల్ షేర్ లో...

ఉరకలేసే కోరిక తెగువజూపుతు ఉంటే
మేలిమి బంగారమై నీ మేను వన్నెలు కురుస్తు ఉన్నది!

అంటూ విస్తుపోతాడీ కవి. ప్రేయసి మేను మేలిమి బంగారు అనడం... ఒక కొత్త పోలికైతే.. ఉరకలేసే కోరిక తెగువ జూపుతు ఉంది. అనడం చమత్కారం.. దాఘ్ దెహెల్వి అన్న గజల్ కవి.. ఇలాగే 'మెరుపంటే నీ చిరినవ్వే.. ప్రళయం నీమేని విరుపే' అంటాడు. ఇక్కడ రఘువీర్ ప్రతాప్ భావన కూడా అదే.. మేలిమి బంగారు మేని వన్నెచూసి కోరిక తెగువ జూపెనంటాడు. దాఘ్ చెలి చిరునవ్వును మెరుపుతో పోల్చితే రఘువీర్ 'వికసించే పూవులో చల్లని నీ నవ్వున్నది' అంటూ.. చెలి చిరు నవ్వును వికసించే పువ్వులో చూస్తాడు.

ఇదో కొత్త EXPRESSION గజల్ కవికి ఉండవలసిన దార్శనికత (లో చూపు) ఇది. గజల్ షేర్లు.. ముక్తకాల్లా దేనికది స్వతంత్ర భావంతో మెరుపులు చిందిస్తాయి. 'రఘువీర్' గజళ్ళలో ఎక్కువ షేర్లు ఇలాంటివే.. అవి స్వతంత్ర భావాల మెరుపు తీగల్లా తళుక్కుమంటాయి.

గుండెలు కరిగిన కొండలు సెలయేరుగ మారెనేమో!
ప్రేమానురాగాలు పొంగారు వేళ మధువైన చంద్రికవే!

అంటూ.. మధువును చంద్రికతో ఉపమింపచేయడం.. శిల్ప సౌందర్యం.

కొండలకు కూడా గుండెలుంటాయని.. అవి కరిగితే సెలయేరుగ మారుతుందని ఊహించడం.. లోతైన భావన. గజల్ లో పర్షియన్, ఉర్దూ కవులు.. ప్రేయసి వియోగాన్ని.. ఎంతో దు:ఖవిహ్వల హృదయాల్తో వర్ణిస్తారు. ఇక్కడ ఈ కవి!

గుండెలోని బాధంత కళ్ళనిండ నీళ్ళాయే
కమ్మని నవ్వులు చూపి చావు తీసుకెళ్తోంది..

అహా! ఎంత నవ్యాతి నవ్యమైన అభివ్యక్తి, గాలిబ్ శిష్యుడు మీర్ మహెదీ 'మజ్రూ' కూడా 'దిల్ కో కోయిబచాసకే క్యాంకర్.. ఉస్కె అందాజ్ హై ఖయామత్ కే ( ఆమె విధానము ప్రళయాంతకము హృదయము నెవరేని ఎట్లు కాపాడుకొందురు? ) అంటాడు. ఇక్కడ రఘువీర్ ప్రతాప్ ప్రేయసి నవ్వులు చూసి చావు తీసుకెళుతోంది అంటారు. అంటే ప్రేయసి హృదయం.. ప్రళయాంతకమనే మజ్రూ భావన ఇక్కడ ధ్వనించలేదూ? ఉర్దూ గజల్ కవులు చెలిని హృదయంలేని శిలగా భావిస్తారు. ఆమె ప్రేమను ప్రళయంగా ఊహిస్తారు. అందుకే శిలలతో స్నేహాలు వలదని చెప్పినా వినవేమి శంకర్? శిలను శిల్పం చేయబూనితి జాలి కనరాదు అంటారు సూరారం శంకర్.. ఉర్దూ గజల్ భావశిల్ప సౌందర్యాన్ని రఘువీర ప్రతాప్, సూరారం శంకరం లాంటి తెలుగు గజల్ కవులు సాధిస్తున్నందుకు మనం గర్వపడాలి.

స్త్రీ పురుషుల మధ్య ఉన్నప్రేమ సూత్రంపై గజల్ నిర్మాణ రహస్యం దాగుంది. తొలుత ప్రేమ, విరహం, శృంగారం, వియోగం వస్తువుగా గజల్ నిర్మాణం జరగాలని కొందరంటారు. ఖసీదాల్లో రాజుల వర్ణన.. గజల్స్ లో జీవుని వేదన.. ప్రేయసి ప్రియుల వియోగాల గర్జన.. ఒకప్పుడు ఉండేది. ఇప్పుడు వాటితో పాటు.. సామాజికాంశాలు, సందేశాలు.. సంవేదనలు, రాజకీయాలు, జాతీయత, కులమత ప్రస్థానాలు, మానవీయ కోణాలు గజల్ వస్తువులై శిల్ప శోభితాలవుతున్నాయి. అందుకే ' గజల్ ఒక కవితా ప్రక్రియ కాదు, అదొక కల్చర్' అని ఎస్. సదాశివగారు అన్నారు. రఘువీరుని గజళ్ళలో 'స్త్రీ' ల గురించి, 'మానవత్వం' గురించి, 'భాష' గురించి.. 'గురువు' గురించి.. ఇలా ఎన్నో వస్తువులపై వైవిధ్య భరితమైన గజళ్ళున్నాయి..

మానవత్వం చిగురించని ఎద ఎందుకు అంటాను





దరహాసం చిందించని పెదవెందుకు అంటాను
కురులారబెట్టుకునే పడతినీవు చెట్టమ్మ
పచ్చ చీరగట్టుకునే ముదిత నీవు చెట్టమ్మ
ఇల్లాలిని దేవతలా కొల్చిచూడు ఒక్కసారి
చెలియను ప్రేమమీర పిల్చి చూడు ఒక్కసారి
తేనెవంటి మాధుర్యపు మాటకదా శివబాబా!
రతనాల రాసులొసగు మూటకదా శివబాబా!

ఇలా వస్తు వైవిధ్యంతో అనేక గజల్స్ రాసిన రఘువీర్ ప్రతాప్ గజల్స్ లో ఎన్నో కొత్త కోణాలు ఆవిష్కరించారు.

కనులు రెండు కలుసుకుంటే ప్రణయగీత మవుతుంది
మనసులోతు తెలుసుకుంటే మధురగీత మవుతుంది!

అంటూ చివరి గజల్ ను అద్భుతంగా శిల్పీకరించాడీ కవి. గజల్ పండాలంటే గజలియత్ ఉండాలి! దవాగలీర్ పద్ధతి.. ఉర్దూ గజళ్ళ నిర్మాణంలో సాధ్యమేమో గాని.. తెలుగు గజళ్ళలో అది దుస్సాధ్యమనే చెప్పాలి. ఒక భాషలోని సొగసు, జిగిబిగి, శబ్ద సౌందర్యం, సౌకుమార్యం, తళుకు బెళుకు, గాఢత, సాంద్రత, తాత్వికత, భావుకత, పూర్తీగా ఆ భాషకే సొంతం. అది ఇతర భాషల్లో నూటికి నూరు శాతం సాధించడం అసాధ్యం. అలా సాధించాలను కోవడం మూర్ఖత్వం. అహంకార తత్వం! అభిజాత్యం! అకాడమిక్ దౌర్భాగ్యం. ఆస్ట్రేలియా గజల్ పోయేట్ Judith wright, 'Shadow of fire' గజల్ సంపుటిలోను, కెనడా గజల్ పోయేట్ Jim Harnison 'Out lyer and Ghazals' లోను.. ఇలా అనేక దేశాల గజల్ కవులు.. ఎవరూ 100% గజల్ లక్షణాలు పాటించలేదు అయితే, కనీసం మత్లా, షేర్లు, కాఫియా, రదీఫ్ లు, తఖులస్ (తప్పనిసరి కాదు) మక్తాలు జాగ్రత్తగా పాటిస్తూ పారశీక గజల్ శిల్ప సంప్రదాయాన్ని కొనసాగిస్తూనే.. ప్రక్రియావైవిధ్యం పాటించాలని.. కొత్త పోకడలు పోవచ్చుని.. గజల్ కవి స్వేచ్ఛా విహంగమని.. పంజరంలోని పక్షికాదని నిరూపించారు. అయితే John Thompson లాంటి వాళ్ళు గజళ్ళ గురించి చెబుతూ 'Poems of careful construction performing controlled progression' అన్నారు. ఈ గజల్ సంపుటిలో 'రఘువీర్ ప్రతాప్' ప్రతి గజల్ ను careful con

struction చేశారనడంలో నాకెట్టి సందేహం లేదు, చాలా వరకు గజల్ నియమాలను పాటించాడు. గజల్ షేర్లను కవితామయం చేయడానికి ప్రయత్నించి సరికొత్త గజల్ శిల్పాన్ని సాధించాడు. గజల్ కు చమత్కారం ముఖ్యం. బులేసే ముష్కరా తుదియే ధేవోహౌజ్ ఫైజ్ అన్నట్లు It was by mistake that she smiled today (Faiz)...

ఈ కవి రఘువీర్ కూడా...
బంధీలే సంకెళ్ళై బంధిస్తాయని తెలిసినా
భ్రమలలోనె సమయమంతా గడుస్తూనే ఉన్నది!
మనకు మనం అల్లుకునే గూళ్ళే అనుబంధాలు
ప్రేమ పాశపు పాకులాట నడుస్తూనే ఉన్నది!

అంటూ.. ఒక్క జీవిత సత్యాన్ని చమత్కార భరితంగా చెప్పడం వల్ల.. ఇలాంటి గజళ్ళలో.. ఒక జీవన సందేశం ఉంటుంది. మోమిన్ ఖాన్ మోమిన్ (1801–1852) 'ఏమి సౌఖ్యము నాకు ప్రేమ ఈయనేలేదు.. ప్రేమ మోసమందు గుండెకాలి చచ్చె' అన్న సత్యాన్ని చెప్పినట్టు.. నేటి గజల్ కవులు.. మానవ సంబంధాలన్నీ మార్కెట్ సంబంధాలుగా మారిన ఈ కంజ్యూమర్ సంస్కృతిలో.. రఘువీర్ ప్రతాప్ లా చక్కని ప్రేమ, మానవత్వం కలబోసిన గజల్స్ తో పాటు సందేశాత్మక గజల్స్ రాయాలని వస్తువైవిధ్యంతో.. శిల్ప సోయగంతో.. తెలుగు గజల్స్ ను.. సౌందర్యభరితం చేయాలని కోరుకుంటూ.. తెలుగు వచన కవిత్వంలో మంచి కవిగా గుర్తింపు పొందిన తమ్ముడు రఘువీర్ ప్రతాప్ ఈ గజల్ సంపుటితో.. మంచి గజల్ కవిగా గుర్తింపు పొందగలడనటంలో నాకెట్టి సందేహం లేదు. ఆతని కలం నుండి భవిష్యత్ లో మరెన్నో గజల్ సంపుటాలు వెలువడాలని ఆశిస్తూ.. మనసారా అభినందిస్తూ.. ఆశీర్వదిస్తున్నా.. జయహో.. తెలుగు గజల్! శుభం!.

కళారత్న **బిక్కి క్రిష్ణ**, ప్రముఖ గజల్ కవి
సుప్రసిద్ధ విమర్శకులు, గజల్ పరిశోధకులు
అధ్యక్షులు నవ్యాంధ్ర రచయితల సంఘం.
సెల్ : 8374439053.





## రఘువీరునికి మణిపూసలతో నుతి

– జె.రామకృష్ణరాజు

చిరుమందహాసంతో
హృదయసంస్కారంతో
మనసుదోచె రఘువీరుడు
సాహిత్యపు సృజనతో!

అనుభవాలే ఒడబోసి
తన కలాన సిరగజేసి
కుమిలిపోకుమని చెప్పెను
ఖాఫియాల గజలు రాసి!

మాన్యశ్రీ రఘువీరా!
నవనీత గుణధీరా!
ఇష్టమైన నీ కష్టం
గజళ్ళుగ వికసించెరా!

కాలం పరిగెత్తుతుంది
మనిషి నడత మారుతుంది
ఈ విలువను రఘువీరా!
మీదు గజలు నేర్పుతుంది!

తిమ్మిని బమ్మిని జేయకు
నీ కొంపను ముంచుకోకు
రఘువీరుని సందేశం
కలహంసని మర్చిపోకు!

ఎంత ప్రేమో చెలిపైన
తోడాయె గజలు రచన
రఘువీరా ! నీ విరహం
పొదిగినావు అక్షరాన!

వైవిధ్యమగు ప్రక్రియలు
నీ ప్రతిభే బహుముఖాలు
రఘువీరా ! పొందితివి
జే జే ల సన్మానాలు!

ఉద్యోగం సాహిత్యం
సమన్వయం మీ తత్వం
ఐదు పదులు దాటినా
ఆదర్శపు వ్యక్తిత్వం!

సాటి కవుల నాదరించె
సముచితంగ సత్కరించె
ధర్మకేతన పీఠమున
కళలను తా గౌరవించె!





ఏచూపిక సోకిందో
ఏగాలికి తాకిందో
రఘువీరుని ఆసాంతం
గజలు కవిగ మార్చిందో!

మనుగడకే అడుగేయని
అభివృద్ధికి పాటుపడని
నేతలేల! రఘువీరా!
అడిగెనిలా నీ గజలని!

రక్తి భక్తి కలగలిసిన
కమనీయం మీదురచన
రఘువీరుని కలం ఇలా
ప్రేమైక సమ్మోహన!

......ఆత్మీయ సోదరునికి ప్రేమతో

**జె.రామకృష్ణరాజు**
ఉపాధ్యాయుడు సంగారెడ్డి
సెల్ నెం : 9550453224

## "ఆప్త వాక్యం"

**ఇరువింటి వెంకటేశ్వర శర్మ**

మోముపై చెరగని చిరునవ్వు, పలకరింపులో ఆత్మీయత, ఇంటికి వచ్చిన సాహితీ మూర్తులను సత్కరించాలనే సద్భావన. అన్నింటికి మించి వారిలో ఉన్న సాహితీ జిజ్ఞాస ఈ రెండు మాటలు రాసేవిధంగా నన్ను పురిగొల్పాయి.

మిత్రులు రఘువీర్ ప్రతాప్ తో నాకు దాదాపుగా దశాబ్ధం కాలం పైనే పరిచయం. తరచుగా కవి సమ్మేళనాలలో కలుసుకునే వాళ్ళం వచన కవిత్వం,నానీలు మొదలుకొని నూతనంగా వస్తున్న మణిపూసల ప్రక్రియ వరకు అన్నింటిలో తన కవిత్వాన్ని ఒంపి మెప్పించడం అభినందనీయం.

కవి ప్రతిభకు, జిజ్ఞాస తోడైతే సాహితీ పిపాసులకు ఊట చెలిమె దొరికినట్లే. సున్నిత పదాల మేళవింపు, సుమధుర భావాల కూర్పు కలిగిన గజల్ వీరిని ఆకర్షించడం గజల్ ప్రియులకు మరో చెలిమె దొరికినట్లే ప్రేమ, విరహం, వేదన, వంటి భావోద్వేగ తరంగాలలో మనసు మునకలు వేసినప్పుడు అందమైన గజళ్ళుగా మలచి వాటిని మన ముందుంచడానికి చేసిన ప్రయత్నమే ఈ 'గజల్ జ్యోత్స్న' గా అవతరించింది. అందుకు వారికి అభినందనలు.

వారి కవితా ప్రతిభను గురించి కొత్తగా చెప్పేదేమి లేదు. వారు ఇదివరకే రచించిన పుస్తకాల్లోని ప్రముఖుల ప్రశంసా వాక్యాలే అందుకు నిదర్శనాలు. ఈ గజల్ సంపుటిని సమీక్షించడం కాదుగానీ నా మనసును ఆకర్షించిన రెండు మూడు షేర్లను ఉటంకించే ప్రయత్నం చేస్తాను.





"తలచుకొనగ నీ జతలో ప్రణయమెంత మధురమో/తెలుపలేక దాచుకున్న విరహమెంత మధురమో"

గజళ్ళల్లో ప్రేయసి అప్రాప్య, ఊహా ప్రేయసిని తలచుకోవడం, తన మనసు తెలుపలేక పొందే విరహం రెండూ మధురమే...అందమైన భావన ఇది.

"మానవత్వం చిగురించని ఎదయెందుకు అంటాను/దరహాసం చిందించని పెదవెందుకు అంటాను"

హృదయం లో మానవత్వం, పెదవిపై చెరగని చిరునవ్వు ఉండాలనడం గొప్ప ఆలోచన.

కనులు రెండు కలుసుకుంటె ప్రణయగీత మవుతుంది/ మనసులోతు తెలుసుకుంటె మధురగీత మవుతుంది.

ఒకరిమనసు ఒకరు తెలుసుకుంటూ ఒక్కటై సాగే ప్రయాణం మధుర ప్రణయమే అని చెప్పడం మనోహరం.

పున్నమి రేయి,కమ్మని హాయి, ఆమని కొమ్మ, అలలకోర్కెలు, వెన్నెల పరువం,

వంటి పదబంధాలతో గజళ్ళకు వన్నెలద్దడం అభినందనీయం.

వారి మనసులాగే గజళ్ళు మరిన్ని రచించాలని అభిలషిస్తూ మరోసారి అభినందనలందిస్తూ.......

**ఇరువింటి వెంకటేశ్వర శర్మ,**
పాలమూరు గజల్ కవి.
సెల్ నెం : 9441943949

## మనసులోని మాట

1990-91 లో నాగర్ కర్నూల్ జిల్లా అచ్చంపేట నుండి వెలువడిన 'పసిడి మొగ్గలు' కవితా సంకలనంలో నా మొదటి కవిత అచ్చైన గుర్తు.. ఇప్పటికి మూడు వచన కవితా సంపుటాలు, రెండు నాని కవితా సంపుటాలు, ఓ రెక్కల కవితా సంపుటి మరి రెండు కవితా సంకలనాలను నా సంపాదకత్వాన వెలువరించాను. ఇపుడీ 'గజల్ జ్యోత్స్న' తెలుగు గజల్ సంపుటి తో పాటుగా రుబాయిల సంపుటిని కూడా మీ ముందుకు తీసుకువస్తున్నాను. ఇందులో నేనెంతవరకు సఫలీకృతమైనానో మీ అమూల్యమైన అభిప్రాయలే నిర్ణయిస్తయని భావిస్తున్నాను. ఇంక హైకూలు, త్రిపదలు, మణిపూసల సంపుటాలు కూడా త్వరలోనే ముద్రణాది కార్యక్రమాలను పూర్తి చేసుకొని సాహితీ ప్రియుల అలరించనున్నాయి. సాహిత్యం ఓ తీరనిదాహం మనసును పలకరించి, పులకింపజేసే కమ్మని చెలిమి తీరం... గజల్ నిర్మాణం గురించి ముందు మాటలలో పెద్దలందరు చెప్పారు కనుక తిరిగి చెప్పడం లేదు.

కృతజ్ఞతలు, ధన్యవాదాలు...

❀ నా గజల్స్ ప్రచురించిన 'నెలవంక నెమలీక' పత్రికా సంపాదకులు శ్రీమతి లక్కరాజు దేవి, శ్రీ యక్కలూరి శ్రీరాములు గార్లకు...

❀ నా గజల్స్ ను పాడి వీడియో తయారు చేసిన డా॥ వాసభూపాల్, శ్రీ కల్లూరి ప్రభాకరాచారి గార్లకు...

❀ సారంగి స్వరాలు సంకలనం లో నా గజల్ కు చోటిచ్చిన డా॥ గడ్డం శ్యామల గారికి...





❀ ఉత్తమ గజల్ పురస్కారాన్ని నా గజల్ కు ప్రకటించిన తెలుగు సాహితీ వైజయంతి నిర్వాకులకు.

❀ విలువైన సలహాలు సూచనలే కాదు అద్భుతమైన చిత్రాలను, 'గజల్ జ్యోత్స్న గా రఘువీరుని కొత్త అడుగులంటూ' ఆత్మీయమైన ముందుమాటతో వెన్నుతట్టి ప్రోత్సహించిన ప్రముఖ గజల్ కవి పొ.శ్రీ.వి.వి.వారి కీర్తిపురస్కార గ్రహీత శ్రీ సూరారం శంకర్ గారికి...

❀ 'గజల్ జ్యోత్స్న కావ్యంతో కాసేపు' అన్న అపురూపమైన ముందు మాటతో నా గజల్స్ ను ప్రేమగా పరిచయం చేసిన సీనియర్ కవులు ఆచార్య ముకుంద సుబ్రమణ్య శర్మ గారికి...

❀ నాకే తెలియని నా గజల్స్ లోని కోణాలెన్నింటినో అద్భుతంగా వెలికితీసి, ఆంధ్రప్రభ దిన పత్రికలో 'కవిత్వపు గుల్మొహర్' గా చక్కని సమీక్షతో పాటుగా 'తెలుగు గజల్స్ లో కొత్తకోణాలు ఆవిష్కరిస్తూ గజల్ చాందినీ వెలిగించిన 'రఘువీరుడు' అంటూ విలువైన ముందుమాటను విశిష్టరూపంలో పొందుపరిచిన ప్రముఖ గజల్ కవి, సుప్రసిద్ధ విమర్శకులు కళారత్న శ్రీ బిక్కికృష్ణ అన్నగారికి...

❀ నా గజల్స్ నిర్మాణంలో తన నిర్మలహృదయ సహకారాన్నే కాదు 'మణిపూసలతో నుతి' అంటూ తన వాత్సల్యానందించిన సోదరుడు శ్రీ జే రామకృష్ణరాజు గారికి...

❀ సౌజన్య హృదయంతో ఆప్తవాక్యాన్ని అందించి భుజం తట్టిన మిత్రులు శ్రీ ఇరువింటి వెంకటేశ్వర శర్మ గారికి...

❀ నా గజల్స్ సవరణలో స్నేహ పూర్వక తోడ్పాటు నందించిన సీనియర్ గజల్ మాస్టర్ శ్రీ కొరుప్రోలు మాధవరావు గారికి...

❀ గ్రంథం డిటీపి పనిలో సహకరించిన శ్రీ చిక్కుల శంకర్ గారికి, ముద్రణ చేసి శ్రీ రాఘవేంద్ర ప్రింటింగ్ ప్రెస్ యాజమాన్యానికి...

❀ నా శ్రీమతి జ్యోత్స్నదేవి, కుమారులు చి॥ శ్రీకేతన్, చి॥ తేజోధర్మ లకు...

ఈ కృతి ఆకృతి దాల్చటానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించిన ప్రతిఒక్కరికీ పేరు పేరున.. కృతజ్ఞతలు, ధన్యవాదాలు తెలుపుకొంటున్నాను.

**ఎవ్వీ రఘువీర్ ప్రతాప్.**







(1)

నాపైనే వెన్నెలలు కురిపిస్తూ ఉంటుంది ఎందుకనో
నావైపే చూపులు మలిపేస్తూ ఉంటుంది ఎందుకనో

పొద్దు తిరుగు పూవుమల్లె చందమామ నవ్వులల్లె
నాకైతే పులకింత కలిగిస్తూ ఉంటుంది ఎందుకనో

చెలిమినే తలపోస్తూ కమలంలా విరబూస్తూ
తానైతే మనస్సంతా పరిచేస్తూ ఉంటుంది ఎందుకనో

పొద్దువాలి పోతుంటే వలపుగోల పెడుతుంటే
రాకుంటే తనువంతా విలపిస్తూ ఉంటుంది ఎందుకనో

కంటికొసన చూపులెన్నో కాలివేళ్ళ మెలికలెన్నొ
కోరికలా తోడై సడిచేస్తూ ఉంటుంది ఎందుకనో

ఉరకలు వేసే పరువాలు పరుగులు తీసే సమయాలు
కోడైతే కలనంతా కరిగిస్తూ ఉంటుంది ఎందుకనో

ప్రేమనే పూజగా హృదయంతో అర్పించే రఘువీర
ఫలితమిస్తే లోకమంత హర్షిస్తూ ఉంటుంది ఎందుకనో







(2)

పదే పదే నాకనులకు – కవ్వింతవు నువ్వే
పెదాలపై జనియించే – పదకవితవు నువ్వే

ఎవరికొరకు ఆవిధాత – నీ రాతను రాసెనో
కొలిచెదనిక నాకై నిను – మదివేల్పువు నువ్వే

నీ దారిన నా చూపులు – వాడిపోయె విరబూసి
ఒకనవ్వైన చాలునాకు – నా ప్రేమవు నువ్వే

ఊరేగను ఎన్నాళ్ళిక – ఊహలన్ని ఇంకెను
ఊసులెన్నో దాచుకున్న– పలుకలేవు నువ్వే

నిరాశలతో నివేదనలు – నిను మరవక ప్రతాపుడు
ఎదురుచూపు ఈ జన్మకు నా ధ్యాసవు నువ్వే

(నవంబర్ 2017 నెలవంక నెమలీకలో)







(3)

వికసించే పూవులో - చల్లని నీ నవ్వున్నది
వినిపించె సవ్వడిలో - తీయని నీ పిలుపున్నది

ప్రణయ మధువు కురియువేల - నిండు జాబిలి నీవెగ
కోవెలేనా హృదయము - కమ్మని నీ రూపున్నది

గగనపువిరి కొలనుల్లో కదలాడే కలువలా
మదిదోచే కుందనపు బొమ్మని - నే కలగన్నది

నాలో ప్రభాత కిరణమై - సురభిళ పరిమళమై
నా మనసిపుడు ఆశల - ఆమని నీవేనన్నది

నా ఎదనేలగ నీవొస్తె - పరవశమీ ప్రతాపుడు
నా జీవితమె ఇకవీడని - తోడుని నీవున్నది





(4)

నేనింకా నీకోసం ఎదురు చూస్తు ఉన్నాను
నీ శ్వాసే నా ధ్యాసై - బ్రతికేస్తు ఉన్నాను

నాటుకున్న నీ రూపం - వలపు చిగురులేసింది
నీ తలపుల మైకంలో - జీవిస్తూ ఉన్నాను

కలతలన్ని కరిగిపోయి - కలల పంట పండాలని
నీ చెలిమికి చకోరమై - ఎదురు చూస్తు ఉన్నాను

గేయమైన నా గాయం - నిను చేరితె సాంత్వన
భారమణచ నా గుండెను - ఊరడిస్తు ఉన్నాను

పాట్లెన్నో ప్రేమలోన - తెలిసిందీ ప్రతాపుడికి
ఓడిపోని గెలుపుకొరకు - తపియిస్తూ ఉన్నాను

(5)

నిన్నే చేరాలని, నీతో - నడవాలని ఉంది
ఒడిలోనే మనసారా - మురవాలని ఉంది

సిరులు పంచు నీ పరిమళాల - పార్శ్వాల్లో తడిసి
పరిష్వంగపు అనుభూతిని - పొందాలని ఉంది

పరితపనే మంత్రంగా - జపియిస్తూ కడదాకా
ప్రేమార్చనకై పుష్పంగా మారాలని ఉంది

కామన తీర్చే అక్షయ దేవికవై - నిలవాలని
కానుకలొసగె స్వర్గసుఖాల్ని కోరాలని ఉంది

నిలువెత్తు అనురాగపు అర్ధానివి నీవేగద
అక్షర మాలల తోడ నిత్యం కొలవాలని ఉంది

విరిసే సుమమై నీవు - పరిమళిస్తే నాకోసం
తుంటరి తుమ్మెదనై నీలో ఒదగాలని ఉంది

నీ చెలిమికి చేయిచాచి - నిలిచెనీ రఘువీరుడు
వసంతమై ఇల విరబూస్తే చూడాలని ఉంది





(6)

ఎందుకిలా ఉన్నావని-నన్నెవరైన అడిగితే
ఏమైందో చెప్పమని-ఇంకెవరైన అడిగితే

మనసు దోచావననా-మాయే చేశావననా
మర్మమేదో ఉన్నదని-నన్నెవరైన అడిగితే

మౌనంగనేనుండన-మోహావేశమననా
ఏది నీ జాడేదని-ఇంకెవరైన అడిగితే

నీదింక నాలోకం-నాలో నీవననా
పిచ్చేమో నీకంటూ-నన్నెవరైన అడిగితే

నాలో తీరని వేదనై-ప్రేమభిక్షకుడిననా
నీవేమిటి ఇలాగని-ఇంకేవరైన అడిగితే

వలపునై తలపుల్లో-మెదలుతున్నావననా
ఎమైపోతావంటూ నన్నెవరైన అడిగితే

పారుని వలచిన దేవదే ఈ ప్రతాపుడననా
నిను మించినదా ప్రేమంటు-ఎవరైన అడిగితే

(7)

చీకటి చీల్చేటి వెలుగే వసంతం
పెదవిన పూచేటి నీనవ్వే వసంతం

తనువంత లయించే–తలపు పులకింత
ఆమని అందపు మోదమే వసంతం

మోముకే సుందరం–కురుల ముంగురులు
నీ సిగ్గు బుగ్గన–మేరుపే వసంతం

మనసు మందారమై–విరిసే తరుణం
ఎద వీణ మీటిన–సొగసే వసంతం

వలపువల విసిరే చూపుకెంత చొరవ
మదిని విరియు–పున్నమే ఓ వసంతం

చిరునగవుకు దాసుడీ–రఘువీరుడు
మెండైన హృదయమె పండిన వసంతం





(8)

కరిగే కాలాన్ని ఇప్పుడు–కొలుస్తున్నది మనస్సు
నీ సన్నిది నా పెన్నిది–తపిస్తున్నది మనస్సు

ఈ సృష్టే లయించినా–పునఃసృష్టి జరిగినా
మరపురాదు మాసిపోదు–నీవునేనన్నది మనస్సు

కఠినమేదొ కరుణయేదొ–మలుపులెన్నొ తెలియునా
మమత విలువ తెలుసుకుంటూ–మసలమన్నది మనస్సు

ప్రణయమో ప్రళయమో–లోకమంతా నిందయో
కనుమొకసారి నీ నీడను–అంటున్నది మనస్సు

తీరని ఋణమేదో తెలియదు–ఈ రఘువీరుడే
నీతో అనుబంధాన్ని–తలపోస్తున్నది మనస్సు

(9)

కన్నుల ప్రమిదల్లో వెలుగేదే నీరూపం కదా
మదిలో పొంగే ఊహలకె నువు - ప్రతిరూపం కదా

వెన్నెల వొంపిన నిండు జాబిలి నీవేనంటే
తలపుల తావుల్లో పాదుకున్న-ప్రియరూపం కదా

గలగల పారెడి జలపాతగీతం నీవేనంటే
సలిపేటి గాయాలకు సుమలేపన-స్వరూపం కదా

నా ఆశల రాసుల్లో-ఆనందం నీవేనంటే
కుసుమాల తోటలో పరిమళించే-సుమరూపం కదా

సాహితీ సుధలూరు స్ఫూర్తి-నీవె ఈ రఘువీరునికి
అపురూప వరమల్లే అందిన-అక్షర రూపం కదా







( 10 )

నీ రూపమే నా మదిలో నిశ్చలమయి నిలిచింది
నీ ధ్యానమే మనసులో నిర్మలమయి తిరిగింది

రోజులన్ని సాగిపోయే కాలమే వీగిపోయే
నీవురాక ఈ దేహము విరహమై మరిగింది

కబురైనా రాదాయే కాలమే వీగిపోయే
కోరికేమో ఉరకలేసి ఉప్పెనయి ఎగిసింది

నీ మాట కమ్మదనం నీ చూపుల ప్రేమతనం
వసంతమై విరిసింది వెన్నెలయి కురిసింది

దిక్కులన్ని ఒక్కటైన చిక్కులెన్ని ఎదురైనా
నీ వలపునే గెలుచుకోవాలని తలపులయి సాగింది

నాతోడు నీవుంటే స్వర్గాన్నే వదులుకుంట
రఘువీరుని అంతరంగం నీ బంధమయి నిలిచింది







( 11 )

తలచుకొనగ నీ జతలో–ప్రణయమెంత మధురమో
తెలుపలేక దాచుకున్న–విరహమెంత మధురమో

వరమైతే నీ ప్రేమే–నా పాలిటి వెన్నెలని
నా తలపే చకోరమై–సాగుటెంత మధురమో

నింగిలోన మెరుపుతీగ–కారుమబ్బు కోచురక
నీ పెదాల దరహాసం– మనసుకెంత మధురమో

నీ సిగలో మరుమల్లెలు – మైమరపేనా తలపు
భ్రమరమై సౌరభాన్ని – జుర్రుటెంత మధురమో

కల్లకాదు నా కలయని – కరుణించగ ఎదురొస్తె
అనుక్షణం తపియించే – గుండెకెంత మధురమో

అలవికాని విరహంతో – విరాగి నీ రఘువింక
ఎదురుచూపు వరమిచ్చెడి – ప్రేమకెంత మధురమో





( 12 )

మౌనమనే మనసేలనో – మాటలనే పలుకుతుంది
ఆ మాటల నాకల మిక పాటలనే ఒలుకుతుంది

ఆగవేమి నీతలపులు – కాదన్నను ఏలనో
నా గుండెన సవ్వడులై ప్రాణాలనె తోడుతుంది

నిలిచిపోయె శాశ్వతమై – కనుపాపల నీరూపు
చెరపలేక నిరతమింక – అశ్రువులనే రాల్చుతుంది

నినుచేరని నా పయనం – ఎదకేలనో దాహార్తి
ఎండమావి అని తెలియు ఆశలనే రేపుతుంది

అందలేని చందమామ – అందిచూడ ఆశలు
అందకున్న అందమైన – వెన్నెలనే కురుస్తుంది

( 13 )

వన్నెలెన్నో ఆరబోసి నన్ను గెలుచుకుంటావు
చూపులెన్నో వొలకబోసి మనస్సు దోచుకుంటావు

సిగ్గుపడె బుగ్గలపై సింగారం వొలుకుతుంటే
ఎందుకని ఎదురుపడితే మోముదాచుకుంటావు

కోర్కెలూరు కన్నులపై రెప్పవాలిపోతుంటే
వలపు తేనె తలపులను ఎలా పంచుకుంటావు

మన్మధుని శరసంపద మేధనాక్రమిస్తుంటే
విరహాల మధురిమను ఎలా కూర్చుకుంటావు

అనురాగం విరబూసే క్షణాలన్ని ముడుపుగట్టి
నన్ను చేరె కలల్ని ఎలా విడుచు కంటావు

పొందుగోరు రఘువీరుని అందుకోవాలంటూ
వయసుపోరు పెడుతుంటె ఎలా దాచుకుంటావు





( 14 )

మీనవంటి కన్నులున్న మనస్సైన నెచ్చెలివో
మల్లెపూల మనసున్న సొగస్సైన కోమలివో

ఎందుకనో నిన్నుగని నన్ను నేను మరిచానే
అందని ఆకాశాన విరబూసిన వెన్నెలవో

ఎన్నిమార్లు చూసినను తనివితీరదా రూపం
జాజిపూల కొమ్మమీది జుంటితేన రుచినీవో

బంగారపు మేనువంటి అరుదైన అందమది
వగలొలికే వయ్యారపు నడుమున్న లతనీవో

నాకోసం దిగివచ్చిన గంధర్వుడి కానుకవో
నగుమోముతో ఎదతడిమె వరమున్న దానవో

జుంటిపూల మాధుర్యం జాలువారు పెదవులవి
రఘువీరుని వడిచేరిన మన్మధుని శరమీవో

( 15 )

మౌన భాష అలవరచుకుంటే మంచిది
లోపం మనమే తెలుసుకుంటే మంచిది

నేరం పరులకు మోపుటెపుడు సులభమే
నీవుగ ఎపుడూ చూసుకుంటే మంచిది

బమ్మిని తిమ్మిగ చేయొచ్చునుకోకు మరి
అదియే నీకు కొంపముంచకుంటే మంచిది

అదుపు చేయు మనసు మనిషినెపుడు ఇలలో
జితేంద్రియుడుగ మార్చుకుంటే మంచిది

గంగలోన మునక పాపాలకు ముక్తల్లే
కల్మషాలు కడిగేస్తుంటే మంచిది

పాపి చిరాయువట నిజమే రఘువీరా
కలహంస లాగ మసలుకుంటే మంచిది





( 16 )

కొంటె చూపులు విసిరి ఎదనుదోస్తావెందుకు
జుంటితేనెలు కురిసి మనసుదోస్తా వెందుకు

వలదువలదని ఒప్పుకాదని-తప్పుకున్నా
దారికాచి ఓ దొర వలపుదోస్తా వెందుకు

తలలారబెట్టుతూ తలపులారబోస్తున్న
గుండెవాకిటన పున్నమై - పూస్తా వెందుకు

నీ ధ్యానం లోనేను-విరహమే తాళనా
నీ స్పర్శతో స్వాంతన-జాగుచేస్తావెందుకు

నా చేతిన పూచిన-గోరింటవు రఘువీర
నా కనుల కలతవై-కవ్విస్తా వెందుకు

( 17 )

కోరిక తీరిందా కొత్తది పుడుతుంది
తీరక చిక్కిందా పాతది తోడైతుంది

చపలత్వమే నీ మనసు తత్వమైతే
వశము తప్పిందా చిత్తము చెడుతుంది

తప్పులు చేసేందుకు అలవాటు పడితే
చేసెడి చర్యంతా సత్యమైంది అనిపిస్తుంది

వెల్గుకు దూరమైతే లోకం చీకటేగా
జ్ఞినం తోడైతే సద్గతి చేకూరుతుంది

వినయమేగ విశ్వాసానికి తొడై నిలిచేది
వంచన ఎప్పుడైన ప్రగతి నిరోధిస్తుంది

నిస్వార్ధమే నిలువెత్తుగా మనిషిని నిలిపేది
సంస్కృతి సంప్రదాయం పద్ధతిని నేర్పుతుంది







( 18 )

మమతల ఆ వరవడిలో ఒదగాలని ఉంది
మధురాల తన ఒడిలో కరగాలని ఉంది

అందమైన వెన్నెలంటి పొందికైన రూపం
కలతల కడతేరుల్లో చేరాలని ఉంది

పొగడపూల నవ్వులవి విరబూసే తరుణం
మురిపాల ఆ జల్లులలో తడవాలని ఉంది

మనసైన ప్రియురాలి మౌనమైన మధువేగా
ప్రణయాల పల్లవిలో రాగ మవ్వాలని ఉంది

రఘువీరుని కావ్యంలో జాలువారు రసరమ్యపు
అనుభూతుల పొంతనలో ఒదగాలని ఉంది





( 19 )

నీ మోమున నవ్వునై విరియాలనుకున్నా
నీ జతలో అడుగునై నడువాలనుకున్నా

చేజారే కాలమ్ము చేదుకోలేమని తెలిసి
నీ కథలో నాయికనై మిగలాలనుకున్నా

నీ ప్రేమ ఒడిలోన నన్ను దాచుకుంటారని
నీ కలల గూటి పక్షినై నిలవాలనుకున్న

విరహాల వరవడిని ఆపలేమని తెలిపి

పర్గులెత్తు హరిణినై నడయాడాలనుకున్నా

వలచేటి బ్రతుకంతా వెలుగు లీను పాలపుంత
రఘువీరు రమణినై నడయాడాలనుకున్నా

( 20 )

ఆత్మవు నీవని తెలుసుకో శాంతిని నీవుపొందుకో
దేహమశాశ్వతం తెలుసుకో నిజాన్ని నీవు తల్చుకో

ఎండమావి బ్రతుకువెంట ఎందులకీ పరుగులంట
సత్యాన్వేషణ సాధనతో సంతృప్తిని నీవు పెంచుకో

కనిపించెడి జగమంత నిరళాక్షుడి ఆటేనంట
కంటికి అగుపించనిదేదో ఉంటుందని నీవు తేల్చుకో

ఆస్తిపాస్తు లేవికావు ఆలుబిడ్డలెవరు వెంటరారు
కామక్రోధాలు మానుకో రాజయోగివై నీవు సాగిపో

శరీరమొక వస్త్రము భ్రుకుటి మధ్యే నీ నివాసము
బుద్ధి అనుసంధానం నేర్చుకో సూత్రధారిని నీవు
కల్పుకో

బ్రహ్మాండ లోకాన అఖండంగా వెలిగే
ఆ పరంజ్యోతిని తల్చుకో ఆత్మజ్ఞానం నీవు అందుకో







( 21 )

ముంగురులు నిను ముద్దాడువేళ మనసైన చంద్రికవే
కనులకాటుకను దిద్దెడువేళ సొగసైన చంద్రికవే

మన్మధుని మదితలచి విధాత నిను సృష్టించాడేమో
పాదాలపారాణి అద్దెడువేళ మృదువైన చంద్రికవే

ఋతువులు ఒక్కటయి వసంతంగా నిను మల్చేనేమో
అరుణిమ బొట్టై మురిసేవేళ అనువైన చంద్రికవే

అద్దాన అందాలు విరిసే వేళ బిగువైన చంద్రికవే
అరువిచ్చిన నీ వయ్యారాలే హంసనడకలు నేర్పేనేమో

గుండెలు కరిగిన కొండలు సెలయేరుగ మారెనేమో
ప్రేమానురాగాలు పొంగారువేళ మధువైన చంద్రికవే

రఘువీరుకుంచె వెన్నెల ముంచి నిను చిత్రించెనేమో
ఆకాశబింబమై అలరారు వేళ విలువైన చంద్రికవే







( 22 )

లోకానికి శ్వాసకదా! అమ్మతనం
జగానికి బాటకదా అమ్మతనం

కరిగే సుగంధమై ఆయువు నిచ్చు
ఆకలైతె అన్నంకదా అమ్మతనం

అమృతాల సారమై దైవాన్ని మించు
రక్తమిచ్చు శక్తి కదా అమ్మతనం

పేగుబంధం ప్రేమపాశాల అక్షయపాత్ర
గుండెచీల్చు త్యాగం కదా అమ్మతనం

కష్టమైన నీకోసం ఇష్టంగా భరించు
బ్రతుకంతా వెల్గుకదా అమ్మతనం

తనప్రాణం సర్వస్వము బిడ్డే రఘువీర
ఏ సాటి దరిరాదు కదా అమ్మ తనం







( 23 )

వరూధుని మానసివై కలలోన వొదిగావే
తలపుల మాధురివై మదిలోన వొదిగావే

వలపులెమితోడ వగచివేగుతు ఉన్నా
మత్తు కోకిలనీవై తోటలోన వొదిగావే

నిరీక్షణ నీకై కొన సాగిస్తూనే ఉన్నా
క్రాంతి దర్శిని నీవై ఇలలోన వొదిగావే

నీ జతలో తన్మయత్వాన ఊగాలనుకున్నా
అందమైన భావానివై గజల్లోన వొదిగావే

ఎదవాటునింత ఎడబాటేల రఘువీర
చిత్ర చైత్రానివై ఎదలోన వొదిగావే





( 24 )

రెప్పల రెక్కలు చాపి చూపు దోచుకెళ్తోంది
కొమ్మల రెమ్మలు చాపి కాపు మోసుకెళ్తోంది

గుండెలోని బాధంత కళ్ళనిండ నీళ్ళాయే
కమ్మని నవ్వులు చూపి చావు తీసుకెళ్తోంది

జీవితాన మలుపులెన్నో గుండె కింది దిగులాయే
దేహపు వస్త్రాల మసి రేవు దుల్పుకెళ్తోంది

గతుకుల బ్రతుకంతా కష్టాల కడలాయే
అందాల బంధాలవి తావు తప్పివెళ్తోంది

కనిపించే జగతంతా వింతేకద రఘువీర
చదరంగపు ఆటలోని పావు కదిలివెళ్తోంది

( 25 )

గాలి ఎన్ని గమకాల్ని నేర్పిందో నా చెలికి
హంస ఎన్ని నడకల్ని నేర్పిందో నా చెలికి

సంతసాన వసంతుడు సంతకాన్ని చేయ్యాలని
గుండె ఎన్ని చలనాల్ని కూర్చిందో నా చెలికి

దరహాసపు మాధుర్యం వొలికింపజెయ్యాలని
కోయిలెన్ని గానాలను చేర్చిందో నా చెలికి

బుగ్గలలో ననుసిగ్గును విరియింపజెయ్యాలని
సుమాలెన్ని సుగంధాల్ని పంపిందో నా చెలికి

రఘువీరుని తలపుల్ని తలపింపజెయ్యలని
తనువెంత తపనల్ని నేర్పిందో నా చెలికి







( 26 )

కురులార బెట్టుకునె పడతినీవు చెట్టమ్మ
పచ్చచీర కట్టుకునె ముదితనీవు చెట్టమ్మ

రాళ్ళిసిరిన చేతులకి పూలను అందిస్తావు
ప్రాణదాన మిచ్చుకునె సఖివినీవు చెట్టమ్మ

కాటువేయు గొడ్డలికి సుగంధాన్ని పూస్తావు
తోడునిల్చి నీడనిచ్చే చెలివినీవు చెట్టమ్మ

నిలువుదోపిడి ఇచ్చే ధధీచివి నీవు
వరమిచ్చి కరుణించే తరుణినీవు చెట్టమ్మ

దివి నుండి భువికొచ్చిన దైవస్వరూపానివి
తనువిచ్చి తరియించే తరువునీవు చెట్టమ్మ

లోకానికి కానుకవు నిస్వార్థప్రేమికవు
కాలుష్యము కడతేర్చే కరుణినీవు చెట్టమ్మ

కన్నతల్లి మమతకన్న మిన్నే కదా! రఘువీర
కష్టాలను ఓర్చుకునె వనితనీవు చెట్టమ్మ





( 27 )

మానవత్వం చిగురించని ఎద ఎందుకు అంటాను
దరహాసం చిందించని పెదవెందుకు అంటాను

వెలలేనిది విలువైనది శ్రమజీవన సౌందర్యం
అభివృద్ధికి పాటుపడని నేతలెందుకు అంటాను

చీకటిని తూడ్చగల వెలుగు రేఖ కావాలని
మనుగడకు అడుగేయని బ్రతుకెందుకు అంటాను

దొంగలంత దొరలైతే ప్రజాస్వామ్య మెట్లైతది
వికసించని కుసుమాలకు విలువెందుకు అంటాను

కలతలన్ని తీరిపోవు తరుణమేది రఘువీర
కలలను పండించని కనులెందుకు అంటాను

( 28 )

అధరానికేల తొందర దరహాసం కావాలని
హృదయానికేల తొందర మధుమాసం కావాలని

మల్లెపూల మనసునీది అల్లుకునే గుణం నీది
పిల్లగాలికేల తొందర సహవాసం కావాలని

పూరేకుల సొగసునీది పులకింతల పొంతనీది
పైటకేల ఈ తొందర ఎదవాసం కావాలని

ఆకాశం పందిరేసి చుక్కల తలంబ్రాలు పోసె
జతనిన్నుకోరుతోంది సుధారసం కావాలని

రాసలీల బాసచేసే రఘువీరునికై వేచి
వేగలేక ఈ విరహం ఆ సరసం కావాలని





( 29 )

ఇలా ఎందుకయ్యిందోనని కుమిలిపోతు ఉండిపోకు
ఎలా ముందుగడుస్తుందోనని వణికిపోతు ఉండిపోకు

సుడిగాలి చుట్టుముట్టిందని ధైర్యాన్ని కోల్పోకు
వెలుగు రేఖలెప్పుడోయని చెదిరిపోతు ఉండిపోకు

నెరవేరని ఆశలతో నేర్చుకోవాలి గుణపాటం
కలవరం ఎదనంటిందని కదిలిపోతు ఉండిపోకు

అపకారము బాధించిందని అడుగేయక ఆగిపోకు
గుండెరగిలి పోయిందని కుమిలిపోతూ ఉండిపోకు

అపజయాలు విజయానికి నాందీలని మరువబోకు
విశ్వాసం కోల్పోతున్నావని బెదిరిపోతు ఉండిపోకు

సంకల్పం ధృడమైతే సాధ్యం కానిదేముంది రఘువీర
సమయం గడిచిపోయిందని కరిగిపోతు ఉండిపోకు

( 30 )

ఎన్నిమార్లు విన్నగాని వినాలనే అన్పిస్తది
ఎన్నిసార్లు కన్నగాని చూడాలనే అన్పిస్తది

ఏమాటకు ఆమాటే చెప్పాలని అనుకుంటే
కమ్మనైన కలలెన్నో కనాలనే అన్పిస్తది

తలపుల్లో తపనలే నిలపాలని అనుకుంటే
తనధ్యాసే నాశ్వాసగా కొలవాలనే అన్పిస్తది

సుమగంధం విరబూసే కుసుమమే తానైతే
తుమ్మెదై మధువులను గ్రోలాలనే అన్పిస్తది

అనుభూతి అక్షరాన మనస్సంతా నింపేసి
కమనీయ కవితగా వ్రాయాలనే అన్పిస్తది

సాఫల్యం దొరికేది ఆ ఒడినే రఘువీర
జన్మంతా వేచియైన కలవాలనే అన్పిస్తది







( 31 )

కనురెప్పల కుంచెలతో రాసేవు ప్రేమలేఖ
అనురాగపు చూపులనే చేసేవు ప్రేమలేఖ

అరుణారుణ బింబాన్ని నుదుటి సింధూరం చేసి
నులివెచ్చని కిరణాన్నే మార్చేవు ప్రేమలేఖ

బిగిసడలని పరువాలు బింకం చూపిస్తుంటే
పైటగాలి విసురులతో చేర్చేవు ప్రేమలేఖ

ఒడిచేరగ వయ్యారం కులుకులు చిందిస్తుంటే
కొంటే చూపు గాలమేసి ఇచ్చేవు ప్రేమలేఖ

ఆకాశపు హరివిల్లే మన్మధ శరముగ మార్చి
రఘువీరుని గుండెలలో దూర్చేవు ప్రేమలేఖ







( 32 )

వెలలేని చిరునవ్వులారబోయగా వెన్నెలేల
ప్రియసఖే తన మన సారబోయగా వెన్నెలేల

మధుపొంతను తాకేటి మధుర సదృశ్యము
తెరతీసి సఖి చూపులారబోయగా వెన్నెలేల

పరువాల పందిరిలో మధువు చిందే వధువు
ఎదపరిచి హృదయమారబోయగా వెన్నెలేల

మదిని కవ్వించే ఈ చల్లని సాయంత్రకాలాన
నల్లని కురులలో మల్లెలారబోయగా వెన్నెలేల

కొంటెభావం వెంటపడి నులి వెచ్చగ తాకింది
హంసను తలపించే హొయలారబోయగా వెన్నెలేల

చూపుకు ఊపిరాడని కనుపాపల కౌగిలది
నాట్యమునేర్పే నడకలారబోయగా వెన్నెలేల

మరపురాని ఊసుల్లో మధువున్నది రఘువీర
గులాబి బుగ్గల్లో సిగ్గులారబోయగా వెన్నలేల





( 33 )

పువ్వు పువ్వులో నీ సొగసు కులుకులీను తున్నది
నా తలపు మేనాలో నీ తళుక్కు ఊరేగు తున్నది

చెరిసగ మవుదామని నిను చేరవస్తుంటే
సిరిమల్లె తోటయి నీ వయసు మురిపిస్తూ వున్నది

ఏకాంతమును ఎంచుకొని ఎద ముంగిట పరుచగ
వెన్నెల జాబిలి నీ మోమును తలపిస్తూ ఉన్నది

ఉరకలేసే కోరిక తెగువ జూపుతు ఉంటే
మేలిమి బంగారమై నీమేను వన్నెలు కురిపిస్తూ
ఉన్నది

అనుభూతుల పందిరిలో మల్లెల మంచమేసే రఘువీర
ఆశల అంబరంలో చుక్కలను మెరిపిస్తూ ఉన్నది

( 34 )

ఇల్లాలిని దేవతలా కొల్చి చూడు ఒక్కసారి
చెలియని ప్రేమమీర పిల్చిచూడు ఒక్కసారి

ప్రపంచాన ప్రతి పువ్వు తననవ్వే తలపించు
స్నేహములో చేయిచేయి కల్పిచూడు ఒక్కసారి

దివిలోని దేవివలె అరుదైన వరమిచ్చు
నాలోకము నీవేనని చెప్పిచూడు ఒక్కసారి

ప్రేమ అనే పరిమళం పంచునట్టి సుమగాత్రి
మనస్సంతా నీదేనని తెల్పిచూడు ఒక్కసారి

మమతల మాధుర్యాలు ఒసగేటి క్షమగాత్రి
అచ్చమైన హృదయాన్ని పంచిచూడు ఒక్కసారి

వెలలేని విలువైన బహుమతే ఆమెకదా!
నమ్మకాన్ని తనమీద ఉంచిచూడు ఒక్కసారి

బ్రతుకంతా వసంతాన్ని విరబూసే తోటకదా!
సహకారం నీవంతుగ ఇచ్చిచూడు ఒక్కసారి

పంచితేనే విలువను పొందుతావు రఘువీర
మరుజన్మ నీతోనని అనిచూడు ఒక్కసారి







( 35 )

తప్పక నే చేరేను అమ్మ ఒడికి
చెప్పక నే జారేను బాల్యంలోకి

అది మరపురాని మధురస్మృతి
పదే పదే దూరేను ఆ కలలోకి

తరుణి ఎదలా కరిగిపోతూ
నదినేనై పారేను వసుధలోకి

కదిలిపోయె క్షమాగుణం నీకుంటే
శత్రువైనా మారేను చెలిమిలోకి

నీలోకి పారించగలిగితే నిస్వార్థం
రారమ్మని కోరేను ఎదలోకి

కోరికన్నది జయిస్తే రఘువీర
ఋషిత్వం చేరేను మనిషిలోకి





( 36 )

వెన్నెలకు నేలపైన మక్కువావె ఎందుకనో
కనులకు నిన్నుగన ఇష్టమాయె ఎందుకనో

ఎందరికీ అర్థమౌను మనసులోని మూగబాధ
గుచ్చుకొనె కఠినత్వం మాటదాయె ఎందుకనో

జీవించుట మానుకొని నటిస్తారు కొందరు
మానవతే మనిషిలోన దూరమాయె ఎందుకనో

ప్రేమపేర ఆడతనం దోపిడికి గురవుతుంటే
వికసించు తరుణాన వాడిపోయె ఎందుకనో

మంచితనం వంచెనకు గురౌతున్న తరుణంలో
మోసగించి గేలుస్తుంటే వేడుకాయె ఎందుకనో

కుతంత్రాల మంత్రాలు ఎన్నాళ్ళని రఘువీర
నమ్మకాలు నిలువెల్లా దోపిడాయె ఎందుకనో

( 37 )

మనసేమో నీ తపనలె తలపోస్తూ ఉన్నది
ఎదవీణ మధుగీతి ఆలపిస్తూ ఉన్నది

చూపులన్ని రాశిపోసి నేవేచి ఉన్నాను
నీ కొరకే పూలబాట పరిచేస్తూ ఉన్నది

విరబూసే చిరునవ్వు విశ్వాసమిస్తుందని
చిలిపిగా వలపుగాలి ఈలవేస్తూ ఉన్నది

పన్నీరు చిలకరించి పలకరించి పోవా
మది తలుపులు నీకోసం తెరిచేస్తూ ఉన్నది

అనురాగ మధువొలికే అపరంజే రఘువీర
నీదుప్రేమ సుగంధాన్ని పెనవేస్తూ ఉన్నది

(తెలుగు సాహితీ వైజయంతి వారి ఉత్తమగజల్ పురస్కారం పొందింది)







( 38 )

గమ్యమెరుగని దారిలోన సాగిపోవుట దేనికి
మనసు నిండుగ నవ్వలేక మనిషి బతుకుట దేనికి

నవ్వు తేనెలు చిందునట్టి తరుణమే సృష్టించుకో
నీతి ఎరుగని జాతితోటి కలిసి ఉండుట దేనికి

మనసు అర్పణ చేయునట్టి తియ్యదనమే తెలుసుకో
ఫలితమివ్వని పూజకోసం కలత చెందుట దేనికి

బాస చేయుట కాదుసుమ్మి చేసి చూపుట నేర్చుకో
ఆచరించని మాటకోసం పాకులాదుటదేనికి

ప్రకృతి పరోపకారపు పాఠమె నేర్పు రఘువీర
సాయపడని చెయ్యికోసం వేచిచూచుట దేనికి





( 39 )

కొత్త చిగురు లేత కొమ్మన పూస్తూనే ఉన్నది
సాగి పడవ దూర తీరం చేరుతూనే ఉన్నది

రేపన్నది లేనిరోజు వస్తుందని ఎరిగినా
ఆశతోనే బ్రతుకంతా సాగుతూనే ఉన్నది

బంధాలే సంకెళ్ళై బంధిస్తాయని తెలిసినా
భ్రమలలోనే సమయమంతా గడుస్తూనే ఉన్నది

మనకు మనం అల్లుకునే గూళ్ళే అనుబంధాలు
ప్రేమ పాశపు పాకులాట నడుస్తూనే ఉన్నది

విలువెరిగి మసలితేనే ధన్యమౌను జన్మగదా
రఘువీర్ గజల్ లోన మానవత్వమే ఉన్నది

( 40 )

గతాలను తవ్వుకొని వగచేవు ఎందుకని
కష్టాలను తడుముకొని గడిపేవు ఎందుకని

జీవితము కాదుకదా వడ్డించిన విస్తరి
ఆశలన్నీ తీరము తాకలేవు ఎందుకని

దారితప్పి నడిస్తేను ముప్పేమో తప్పనిది
ముసిరేటి బాధలకు జడిసేవు ఎందుకని

మనసారా నవ్వేటి మర్మాన్ని ఎరుగవా?
మానవతె మనిషిగా నిలిపేను ఎందుకని

విరిసే పరిమళం క్షమాగుణం రఘువీర
నిస్వార్థ సేవతోనే గెలిచేవు ఎందుకని





( 41 )

ఈ చూపులు నీ రాకకు వేచిచూసే తరుణాన
నా ఆశలు నీ దారిన పరిచేసే తరుణాన

ఏడ దాగి ఉన్నావో కలువకనుల అలివేణి
రుతువులన్ని వసంతాన్ని విరబూసే తరుణాన

ఎందుకలా దాగేవో వలపుసిరుల విరిబోణి
స్వర్గాన్నే నీ దరికి చేరవేసే తరుణాన

సిగ్గునెలా దాస్తావో సిరివెన్నెల నెలరాణి
హృదయాన్నే నీ చెంతన పరిచేసే తరుణాన

పరువాన్ని ప్రతాపునికి పంచవేల ప్రణయిని
తలంబ్రాలు తారకలై జాలువారే తరుణాన

(42 )

నీ లోనె పొందికైన అందముంది తెలుసునా!
నీతోనె ప్రకృతంత మురిసింది తెలుసునా!

ఇన్నినాళ్ళ కలలన్నీ పండేటి తరుణాన
కోరికె సఫలమై విరిసింది తెలుసునా!

మేలిముసుగు తెరలన్నీ తొలగిపోవు సమయాన
మదిలోన జడివాన కురిసింది తెలుసునా!

హృదయాన్నె పరిచేస్తూ స్వాగతమన్న క్షణాన
కళ్ళల్లో ఆనందం మెరిసింది తెలుసునా!

మమతా మకరందం రఘువీరుని ఎదనింపగ
వలచిన మనసే పిలిచింది తెలుసునా!





(43 )

పున్నమిరేయి వెన్నెల పానుపు పరుస్తున్నది
కమ్మని హాయి రెక్కల తలుపు తెరుస్తున్నది

నింగి వంగి నేలను ముద్దాడు తరుణాన
ఆమని కొమ్మ పచ్చని మారుపు తలుస్తున్నది

వెన్నెల పరువం కన్నుల కౌగిట కరిగేవేళ
దాగని మధురిమ దోర వలపు దోస్తున్నది

తీరం తాకగ అలల కోర్కెలు ఎగిసేవేళ
సిగ్గులు పూసిన బుగ్గన ఎరుపు మెరుస్తున్నది

ప్రణయకేళికి ప్రకృతి పిలుపు అందేవేళ
ప్రేయసి గుండెన కోలువై తలపు కొలుస్తున్నది

( 44 )

అమృతం అమ్మభాషగ జాలువారు తెలుగు
హృదయమే మధురంగ అలరారు తెలుగు

ప్రగతికి గీతమైన సుమనోహరపు భాష
మధువులున్న పదములై చెవులూరు తెలుగు

సాటిలేని మేటిదీ సరళసుందర భాష
జానపద సంపదలై సుధలూరు తెలుగు

భాషణలో భావనలో మాధుర్యపు భాష
ఏబదారు అక్షరాల తేనెలూరు తెలుగు

అమ్మతనం నిండుకున్న అమృతంపు భాష
అనురాగ భావనలై ప్రేమలూరు తెలుగు

అనుబంధ మల్లుకున్న అరుదైనదీ భాష
విజ్ఞానపు నిధులున్న సిరులూరు తెలుగు

కావ్య ప్రభందమై రఘు వందించిన భాష
వికాసపు విలువలెన్నో చెలువారు తెలుగు







( 45 )

తేనెవంటి మాధుర్యపు మాటకదా శివబాబా
రతనాల రాసులొసగు మూటకదా శివబాబా

తానే ఒకదేహమనుచు తలచు తలలు ఎన్నాళ్ళో
అవినాషి ఆత్మవనుచు నేర్పెకదా శివబాబా

పంకిలమంటక పంకజమోలె వికసితమౌను
పవిత్రతే ముఖ్యమనుచు తెల్పెకదా శివబాబా

జ్యోతిబిందు పరమాత్మను బుద్ధిలోన నిలిపితే
మనసు నిలయంలోనె వెలయు కదా శివబాబా

మురళిని వినిపించే ఆధారమే బ్రహ్మాతనవు
రాజయోగి కావాలని చెప్పెకదా శివబాబా

పరచింతన మానేసి స్వచింతన చేయమంటూ
జ్ఞాన యోగ బోధనను చేసె కదా శివబాబా

సర్వవ్యాపి అన తగని సర్వాత్మల తండ్రితాను
సత్యగీత ప్రధాతయై నిల్చెకదా శివబాబా



గజల్ జ్యోత్స్న

( 46 )

అవినాషి జ్ఞానమిచ్చు అమృతమూర్తి అతడు
సుజ్ఞానపు వెల్గునిచ్చు సద్గురుమూర్తి అతడు

సద్బుద్ధిని పాదుకొల్పె పరివర్తన కార్యుడు
సత్యధర్మ స్థాపనకు సాధన స్ఫూర్తి అతడు

నిరహంకార నిర్వికార ఆది మధ్యాంత రహితుడు
విశ్వకళ్యాణ గుణమున్న పవిత్రమూర్తి అతడు

శుభభావన పరిమళాలు వెల్లివిరియగ జగాన
మురళీరవళిని వినిపించే పరమస్ఫూర్తి అతడు

సృష్టిచక్ర సుధారసము స్మృతిలో నిలుపుటకు
బ్రహ్మాబాబా భ్రుకుటిలో వెలసేమూర్తి అతడు

సృష్టినాటక రంగపు పాత్రే నీవని తెల్పగ
ముక్తి మార్గము చూపిన ఆదిమూర్తి అతడు

సర్వాత్మల తండ్రిగ సద్గతినొసగే దాతగా
సర్వశక్తి సంపదకు ఆధారమూర్తి అతడు

( 47 )

ప్రశాంతతే కావాలంది మనసన్నదెపుడైనా
మాధుర్యమె కోరుకుంది తలపన్నదెపుడైనా

గలగలమని జలగీతం గొంతువిప్పి పాడుతుంటె
ప్రవాహమై సాగుతుంది మరులన్నదెపుడైనా

చిరుచిరు నవ్వులు విరబూసే విరితోటే నీవైతే
విహంగమై ఎగురుతుంది కోరికన్నదెపుడైనా

దాచుకున్న తపనలు తలపులనే తడుముతుంటే
ఉచ్ఛ్వాసగ కదులుతుంది వలపన్నదెపుడైనా

అనుబంధపు సుమగంధం ఆరిపోదు రఘువీర
మొలవదింక కలనైనా మరుపన్నదెపుడైనా





( 48 )

కనులు రెండు కలుసుకుంటే ప్రణయగీత మవుతుంది
మనసులోతు తెలుసుకుంటే మధురగీత మవుతుంది

ప్రేమకోరి ఎదకలువలు విరహాలను మీటుతుంటే
కలుపుకున్న తలపులన్ని హృదయగీత మవుతుంది

అంతరాన కొంటెతనపు ఆవిరులు ఊరుతుంటే
వలపువీణలు మరులుగొలుపు విమలగీత మవుతుంది

మమతల పంటలు పండేటి మధుమాసం అరుదెంచగ
కలబోసిన కలలెన్నెన్నో విజయగీత మవుతుంది

సిరిమల్లెలు బ్రతుకంతయు విరబూయును రఘువీర
పులకింతల తుంపరలో బ్రతుకుగీత మవుతుంది

( 49 )

తలపునై నీ హృదయసీమలో కలువవలెనని ఉన్నది
చెలిమినై నీ వలపు ఎదలో నిలువవలెనని ఉన్నది

లేత వెలుగుల నీలికన్నులు రెప్పలార్చుతుండగా
గువ్వనై నీ గుండె గూటిలో ఒదుగ వలెనని ఉన్నది

ఈ మనో దర్పణ సీమలో నీ రూపు నిలిచి ఉండగా
శ్వాసనై నీ కోశవీధిన తిరుగవలెనని ఉన్నది

తళుకులీనే తారలెన్నో కులుకుమేనిలో నిలువగ
మధువునై నీ పెదవి అంచుల జారవలెనని ఉన్నది

నీదు నుదుటి కుంకుమై నిత్యశోభతో వెలుగగా
ప్రాణమై నీ ప్రణయ జ్యోతిగా వెలగవలెనని ఉన్నది

నీ చరణ మంజీర నాట్యం ఎదను వేడుకచేయగా
మధుర మంజుల మువ్వనై కదలవలెనని ఉన్నది

ప్రణవమై నీ కోవెలెదుట నిలిచెను రఘువీరుడు
నీ కుసుమ కోమల మధువులె కోరవలెనని ఉన్నది

(నెలవంక నెమలీక నవంబర్ 2017లో ప్రచురితమైంది







( 50 )

ఇంపైన సొగసున్న అతిలోక సుందరివి
సొంపైన నడకున్న జగదేక సుందరివి

అందమైన తోటలోని అరుదైన పుష్పమోలె
చురుకైన కనులున్న సురలోక సుందరివి

పదునైన చూపులతో కవ్వించే కాటుకోలె
చురుకైన కనులున్న సురలోక సుందరివి

పదునైన చూపులతో కవ్వించే కాటుకోలె
సన్నటి నడుమున్న పరలోక సుందరివి

పొంగేటి తరంగాన్ని తలపించే ఎదవోలె
దాతృత్వం నిండి ఉన్న దేవలోక సుందరివి

పూసేటి వెల్లుపూల ఉదయారుణ బింబమోలె
సౌరభాల సుగుణమున్న చంద్రలోక సుందరివి

చక్కదనపు చెక్కిలిపై చిక్కని చిరునవ్వోలె
విరబూసే మనసున్న ఇహలోక సుందరివి

ముళ్ళనైన అల్లుకునె లతతానే రఘువీర
లాలిత్యం పొదిగున్న ఇంద్రలోక సుందరివి





## పరిచయం


పేరు : ఎన్వీ రఘువీర్ ప్రతాప్
పుట్టినతేది : 29.07.1964
జన్మస్థలం : కల్వకోల్ గ్రామం, నాగర్ కర్నూల్ జిల్లా, మహబూబ్ నగర్, తెలంగాణ రాష్ట్రం
చిరునామా : 9-6-369, ప్లాట్ నెం-103, రోడ్ - 14, మారుతీనగర్, చంపాపేట్, హైదరాబాద్-59
ఈమెయిల్ : nvrvp1@gmail.com
సెల్ : 91-9440551552

తల్లిదండ్రులు : శ్రీమతి వెంకట శేషమ్మ, శ్రీ నారాయణదాసు శ్రీరామాచార్యులు
వృత్తి : సూపరింటెండెంట్ అటవీ శాఖ, తెలంగాణ ప్రభుత్వం
రచనలు : కవితాంజలి(2006),అమ్మంటే(2009), విశ్వరహస్యవిశేషము(2010), అంతర్వాహిని(2011), అవ్యక్త(2012 సంపాదకుడు), అపురూపం (2013సంపాదకుడు), చిగురాకులఊహలలో (2018), మహోన్నతవృక్షాలు (2018), అమృతధార (సంపాదకుడు), సుధాఝరులు, నిశ్శబ్దలయ, సమీక్షాతోరణమ్, మధర్ (ఆంగ్లం), నానిముత్యాలు (2018), కవనోన్మిలనమ్, కావ్యమధూళిక
అభిరుచులు : చిత్రలేఖనం, విమర్శ, రాజయోగధ్యానం, రంగస్థలనటన.

**పురస్కారాలు, బిరుదులు, సన్మానాలు :** మహాత్మా జ్యోతిరావుపూలే పురస్కారం

- 2006 దార్లసంస్థాపక పురస్కారం

- ◆ 2007పాలమూరు యువ సాహితీ కెరటం బిరుదు ప్రదానం పాలమూరు సాహితీ వారిచే
- ◆ డా.బి ఆర్ అంబేద్కర్ రాష్ట్ర స్థాయి పురస్కారం
- ◆ 2007లో విద్యాసేవాతరంగ పురస్కారం లైన్స్ క్లబ్ వారిచే
- ◆ ఇందిరా ప్రియదర్శిని పురస్కారం (సాహిత్యంలో)
- ◆ 2009లో చెలిమి సాహితీ విజయవాడ వారిచే
- ◆ 2009లో ఎక్స్ రే శతాబ్ది పురస్కారం
- ◆ 2009 'సేవారత్న' బిరుదు ప్రదానం సృజన ఆర్ట్ క్రియేషన్స్ వారిచే
- ◆ 2009 రాష్ట్ర స్థాయి ఉగాది విశిష్ఠ పురస్కారం మానస సాహిత్య అకాడమీ విజయవాడ వారిచే
- ◆ 2009 సృజన ఆర్ట్స్ క్రియేషన్స్ విశిష్ఠ పురస్కారం
- ◆ 2011 ఎస్.వి.డి సాహితీ సంస్థ పురస్కారం
- ◆ 2011 ఆంధ్రప్రదేశ్ విశ్వబ్రాహ్మణ పరిషత్ వేదకళాశాల తెనాలి వారిచే సన్మానం
- ◆ 2012 సాహితీకిరణం కవితా పురస్కారం
- ◆ స్వర్ణకంకణ సత్కారం 2012 కాకినాడ సూర్యసాహిత్య వేధిక వారిచే
- ◆ 2013 ఇందిరా ప్రియదర్శిని ప్రజ్ఞా అవార్డ్ శ్రీలలితా కల్చరల్ అసోసియోషన్స్
- ◆ 2013 ప్రతిష్ఠాత్మక లెజెండర్ పురస్కారం నేతాజీ ఫౌండేషన్ హైదరాబాద్ వారిచే
- ◆ 2013 సాధన స్ఫూర్తిపురస్కారం
- ◆ 2014 కన్నడసాహిత్యసమ్మేళనమ్ పురస్కారంకన్నడ సాహిత్య పరిషత్ రాయ్ దుర్గ వారిచే
- ◆ 2014 తోడు నీడ పురస్కారంజి.వి.ఆర్ కల్చరల్ ఫౌండేషన్స్ వారిచే
- ◆ 2014 నైపుణ్య పురస్కారం లలిత కల్చరల్ వారిచే
- ◆ 2014 తేజ సాహిత్య పురస్కారం
- ◆ 2014 'కవితాశ్రీ' బిరుదు ప్రదానం ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడు గారెచే
- ◆ 2014 కలహంస పురస్కారం కళాభారతి వేదిక తాండూర్





- ◆ 2014 గ్లోబల్ ఫీస్ అవార్డు
- ◆ 2014 నైపుణ్య అవార్డు
- ◆ 2015 సంప్రదాయ పురస్కారం పద్మభూషణ్ డా. సినారె చేతుల మీదుగా
- ◆ 2015 అంతర్వేది ప్రపంచ తెలుగు కవితోత్సవంలో సన్మానం
- ◆ 2015 యం.వి. నర్సింహా రెడ్డి రాష్ట్రస్థాయి సాహితీ పురస్కారం కరీంనగర్
- ◆ 2015 అపురూపం పుస్తకానికి సహజసాహితి పురస్కారం
- ◆ 2016 వై.ఎస్.మెన్స్ ఇంటర్ నేషనల్స్ క్లబ్ సికింద్రాబాద్ ఉగాది పురస్కారం
- ◆ 2016లో సహజసాహితి చీరాల వారిచే
- ◆ 2016 గురజాడ అప్పారావుసాహితీ పురస్కారం రత్నమ్మ ఛారిటబుల్ సొసైటీవారిచే
- ◆ 2016 జ్యోత్సకళాపీఠం పురస్కారం.
- ◆ 2016 కీర్తి పురస్కారం పినాకినీ యూత్ కల్చరల్ అసోసియేషన్ నెల్లూరు వారిచే
- ◆ 2017 గిరిరాజు విజయలక్ష్మి సేవాపురస్కారం బింగి మల్లేశ్వరీ మెమోరియల్ ట్రస్ట్ వారిచే
- ◆ 2017 తెలుగువెలుగు పురస్కారం ముంబాయి అంతర్జాతీయ తెలుగు
- ◆ ఉత్సవాలలో మారిషస్ ఉపాధ్యక్షుల చేతుల మీదుగా
- ◆ కవన వేదిక పురస్కారం తెలుగు యూనివర్సిటీ ఉపాధ్యక్షులు శ్రీమతి ఆవుల మంజులత చేతుల మీదుగా
- ◆ 2017 సచ్చిదానందకళాపీఠం పురస్కారం
- ◆ 2017 తెలుగు దీప్తి పురస్కారం తెలుగు కళావేదిక కడప వారిచే
- ◆ సెవెన్ హిల్స్ ప్రతిభాపురస్కారం
- ◆ 2017 పాతూరి మాణిక్యమ్మ కీర్తి పురస్కారం నెల్లూరు
- ◆ 2017 సంక్రాంతి కవితా పురస్కారం జి.వి.ఆర్, ఆరాదనా కల్చరల్ అసోసియేషన్
- ◆ 2017 "సాహిత్య శ్రీ" పురస్కార ప్రదానం అఖిల భారతీయ బాషా
- ◆ సాహిత్య సమ్మేళన బోపాల్ మధ్యప్రదేశ్ వారిచే

- 2018 ఉగాది పురస్కారం శ్రీ లలితా కల్చరల్ అసోసియేషన్
- 2018 గిడుగు రామమూర్తి పంతులు భాష సాహిత్య సేవా పురస్కారం –నవ్యాంధ్ర రచయితల సంఘం
- 2018 డా.మాడా నాగభూషణం గుప్త సాహితీ పురస్కారం ఆచార్య ఎన్. గోపి గారిచే
- 2018 రాజా వాసిరెడ్డి ఫౌండేషన్స్ సాహితీ పురస్కారం
- 2018 డా.సి. నారాయణ రెడ్డి సాహితీ పురస్కారం డా. ఎన్. గోపి గారిచే గోల్డెన్ స్టార్ యూత్ అసోసియేషన్
- 2018 కీర్తి రత్న పురస్కారం మాజీ గవర్నర్ కె. రోశయ్య గారిచే సాయి సంగీత అకాడమీ
- 2018 విశ్వకర్మ లెజెండరి అవార్డు – విశ్వకర్మ నాలెడ్జ్ సెంటర్ హైదరాబాద్
- సుస్వరభారతి పురస్కారం – ఎస్.పి.శైలజ గారిచే
- TNGO's Mahaboobnagar District Felicitation
- కలహంస పురస్కారం నెలవంక నెమలీక వారిచే
- ప్రతిభామూర్తి పురస్కారం జ్ఞానపీఠ్ పురస్కారగ్రహీత డా. సినారె గారిచే
- అంతర్జాతీయ రచయితల ఉత్సవం సందర్భంగా హర్యానా
- రాష్ట్రసాహిత్య అకాడమీ వారిచే జ్ఞాపిక
- జాతీయకళాలయవిశిష్ఠ పురస్కారం పాలకొల్లు సంస్థ వారిచే
- పద్మభూషణ్ డా॥ సినారె చేతుల మీదుగా గోల్డెన్ స్టార్ యూత్ కల్చరల్ పురస్కారం
- నెల్లూరు గుత్తాల రమణమ్మ సాహిత్య పురస్కారం
- జాగృతి కిరణ్ ఫౌండేషన్ పురస్కారం డా. ఎన్. ఎన్ మూర్తి గారిచే
- కవనప్రదీప బిరుదు ప్రదానం ఇందూర్ భారతి నిజామాబాద్ వారిచే
- సాహిత్యరత్న బిరుదు ప్రదానం మానస సాంస్కృతిక అకాడమీ విజయవాడ వారిచే
- కళారాజా కల్చరల్ అసోసియేషన్ వారిచే సన్మానం
- బండికల్లు వెంకటేశ్వర్లు స్మారక పురస్కారం





# ముద్రిత గ్రంథాలు
















**GHAZAL JYOTSNA**

**Poetry of Telugu Gazals**

**by**

**NV Raghuveer Pratap**



**Dharmakethanam**
**Sahitya Kala Peetam**



రఘువీర్ ప్రతాప్ నాకు చాలా కాలంగా తెలుసు. వీరు చక్కని స్నేహశీలి, సౌమ్యులు పైగా కవి. ధర్మకేతనం సాహిత్య కళాపీఠం ద్వారా తెలుగు భాషామతల్లికి వీరు చేస్తున్న సేవ ప్రశంసనీయమై... వీరు అపురూపం, అవ్యక్త వంటి సంకలనాలస... కవుల కలాలకు వెలుగునిచ్చారు

-కీర్తి పురస్కార గ్రహీత శ్రీ సూరారం శ...

ఎన్నో సాహితీ ప్రక్రియలలో విశిష్ట అనుభ... కలిగిన శ్రీ రఘువీర్ ప్రతాప్ గారు ఈ గజల్ జ్యో... కావ్యంలో ఆణి ముత్యాల్లాంటి అద్భుతమైన గజల్స్... మనకందించారు.గజల్ నిర్మాణంలో ప్రతాప్ గారి కనబరిచిన ప్రతిభని మనం ప్రత్యేకంగా చెప్పుకోవాలి. నడకలో, చందస్సులో తడబాటులేకుండా ఉండటం ఎంతైనా ప్రశంసనీయము.

- ఆచార్య ముకుంద సుబ్రహ్మణ్య శర్మ.

రఘువీర్ ప్రతాప్ గజల్ సౌందర్యాన్ని విశ్లేషించడానికి ప్రౌఢయచక్షువులు అవసరమేమో అనిపిస్తుంది ఎందుకంటే, సహజంగా మంచి భావుకుడైన రఘువీర్ ప్రతాప్, కవిత్వాన్ని, వ్యక్తిత్వాన్ని, స్వీయానుభూతిని, భావుకతను, జీవన తాత్వికతను కలబోసి గజల్స్‌ను సర్వాంగసుందరంగా, భావ బంధురంగా, శిల్పీకరించారు.

- కళారత్న బిక్కి క్రిష్ణ.

మోముపై చెరగని చిరునవ్వు, పలకరింపులో ఆత్మీయత, కవులను సత్కరించే సుగుణం అంతకు మించి వారిలోని సాహితీ జిజ్ఞాస నన్నాకర్షించాయి. కవిత్వం, నానీలు, రెక్కలు, రుబాయీలు మొదలు ఈ నాటి మణిపూసల ప్రక్రియల వరకు అన్నింటిలో తన కవిత్వాన్ని పొంపి మెప్పించడం అభినందనీయం.

- ఇరువింటి వెంకటేశ్వర శర్మ.

మాన్యశ్రీ రఘువీర! నవనీత గుణధీర! ఇష్టమైన నీ కష్టం గజళ్ళుగా వికసించెరా! ఉద్యోగం సాహిత్యం సమన్వయం మీ తత్వం ఐదు పదులు దాటిన ఆదర్శపు వ్యక్తిత్వం!

- జె. రామకృష్ణరాజు.